# లగన్

'బాదల్' తన కుమార్తె పెండ్లిలో వందపశువులను కట్నంగా ఇస్తానని చేసిన వాగ్దానానికి భిన్నంగా వ్యవహరించి వుండకపోతే 'బరౌల్' 'బజటా' గ్రామాలచరిత్ర ఏనాడైనా ఏ ఒక్కరికైనా తెలిసివుండేదో లేదో అన్నది సందేహాస్పదమైన విషయమే.

'బజటా' ఒక కుగ్రామం. 'చిరగ్రామా'నికి తూర్పుగా ఐదుమైళ్ళ దూరంలో 'బేతవా' నదివొడ్డునవుంది. ఆ పాత పల్లెలో ఏనాడో కట్టిన రాతిగోడల చిహ్నాలూ నేడు శిథిలమైపోయిన ఆంజనేయ విగ్రహం, 'సతీశిలా' ఇప్పటికీ మిగిలివున్నాయి. 'బరౌల్' గ్రామం మాత్రం ఇప్పటికీ మంచి దశలోనేవుంది. అది 'చిరగ్రామా'నికి ఈశాన్యమూలాను ఏడు మైళ్ళ దూరంలో 'బేతవా' నది ఆవలివొడ్డున ఎత్తైయిన దిబ్బమీదవుంది. ఏటి ప్రక్కగా నడచి 'చేదర్' అనే వూరికి తిన్నగా ఏరుదాటితే 'బరౌల్' 'బజటా'కు షుమారు ఐదారు మైళ్ళ దూరముంటుంది. అలాగాక ఈదుతూ ఏటిగుండా వెళ్ళాలనుకుంటే రెండు మూడు మైళ్ళకన్న ఎక్కువ దూరం వుండదు. కాని 'బేతవా' నదిని ఈదటమే! కొండలు, గుట్టలు పగలకొట్టుకొని, చీల్చుకొని ఎన్నోపాయలుగా చీలి వురకలు వేస్తూపోయే 'బేతవా'ను వర్షకాలంలో ఈదటం సామాన్యమైన పనికాదు. అందులోనూ 'బజటా' నుంచి ఏటిమీదుగా 'బరౌల్' వెళ్ళటం దాదాపు అసంభవమేనని చెప్పవచ్చు.

పందొమ్మిదవ శతాబ్దం ప్రారంభపు రోజులనాటి విషయం. 'బుందేల ఖండం'లోని ఎస్టేట్లు ఇంగ్లీషువాళ్ళ సంధులకు లోబడి తమ వునికిని కాపాడుకొని నిల్చివున్నాయి. 'చిరగ్రామం' జాగీరు కొంత మహారాష్ట్రుల, కొంత ఇంగ్లీషువాళ్ళ ప్రభావం క్రింద వుంది. కాని 'బజటా' 'బరౌల్' గ్రామాలు మాత్రం తమ సర్కిలులో ఎవరి ప్రభావానికి లోనైవున్నట్లుగా వుండేవికావు.

'బజటా' గ్రామపు శిబూ (మాతే) 'బరౌల్' గ్రామపు 'బాదల్' (చౌదరి) ఉభయులూ సరిసమానమైన ధనసంపన్నులు. మూడు నాల్గు వందల పశువులు (ఆవులు గేదెలు) ఇద్దరిదగ్గర వున్నాయి. ఉభయులూ ఒకరునొకర్ని లక్షాధిపతిగా భావిస్తూండేవాళ్ళు. కాని ఎవరిదగ్గర ఎంత ఆస్తివుందో ఇద్దరికీ సరిగ్గా తెలియదు.

'శిబూ'కు ఒకే ఒక కొడుకు. పేరు దేవసింహుడు, తల్లి లేనికారణంగా అతను తండ్రికి గారాబుపట్టిగా. పెరిగి పెద్దవాడయ్యాడు.

'బాదల్' చాల పెద్దకుటుంబీకుడు, కొడుకులున్నారు; కోడళ్ళున్నారు కాని ఆడసంతతిమాత్రం ఒక్కతే, పేరు 'రామా'.

తనకుమారుని వివాహం ఏదైనా మంచి సంపన్నకుటుంబంలో చేయాలని అభిలాషగావుంది. 'శిబూ'కు. ఈ అభిలాష కారణంగానే పిల్లవాడికి పెళ్ళిఈడు మించిపోతున్నా సరియైన సంబంధం దొరకక ఇంకా వివాహం చేయలేదు. అటు బాదల్‌కు యిలాంటి కోరికయే వుంది. తనకన్న ఎక్కువ

స్థితిపరుల కుటుంబంలో 'రామా' నిచ్చి పెండ్లి చేయాలని ఆలోచిస్తున్నాడు. ఈ ఉద్దేశ్యంతోనే ముందు కొడుకుల పెళ్ళిళ్ళు, కార్యాలు అన్నీ ముగించుకు కూర్చున్నాడు. చాల రోజులవరకు ఈ షాహుకార్లు ఇద్దరూ ఒకర్నిగురించి మరొకరు ఆలోచించకుండానే వున్నారు. ఎందుకంటే 'శిబూ' తనకున్న నాలుగైదువందల పశువులతోనే సంతృప్తిచెంది వుండలేదు. కొడుక్కి కట్నం బాగా రావాలనివుంది. అటు 'బాదల్' చౌధరి తన పశుసంపదను మరింత పెంచాలనే చూస్తున్నాడు. గాని తగ్గించాలని ఎక్కడా ఆలోచించటంలేదు. ఇది కొద్దీ గొప్పగా అందరికీ తెలిసినవిషయమే.

కాని ఎంతదూరంపోయి వెదకినా, ఎన్నిచోట్ల ఆలో చించినా తానుకోరిన సంబంధం దొరకలేదు. చివరకు 'శిబూ మహాతో' కుమారునకే తనకుమార్తెనిచ్చి వివాహం చేయ టానికి నిశ్చయించుకొన్నాడు. కట్నంక్రింద వందగేదెలు ఇచ్చేటట్లుగా బాదల్ చేత వాగ్దానం చేయించుకున్నాడు పెండ్లి కొడుకు తండ్రి 'శిబూ'. కాని ఆకాలంలో ఇలాంటి ఆచారం లేదు కట్నాలు – కానుకలు లేకపోతే పెళ్ళిళ్ళు జరగక పోవటమనేదేమీలేదు. ఐనా 'శిబూ' కట్నం కావాలన్న కోరికతో సంఘంలో ఒక కొత్త సాంప్రదాయాన్ని ప్రవేశపెట్ట జూస్తున్నాడు. అటు 'బాదల్' చౌదరి రెండు కారణాల వలన తనకుమార్తె 'రామా' వివాహం సందర్భంలో వంద గేదెలు కట్నం ఇస్తానని వాగ్దానం చేయవలసి వచ్చింది. ఒకటి పాత ఆచారాలుపోయి కొత్త ఆచారాలు తలెత్తు తున్నాయి; రెండు పెళ్ళియీడు దాటిపోతోంది.

తన్నే మాటలు చెవినిపడేటప్పటికి ఒళ్ళంతా మండిపోయింది. ఎటుబోయి ఎలావస్తుందేమోనని ముందు జాగ్రత్తలు తీసుకు న్నాడు. అగ్నిరక్షణ ఏర్పాట్లు వెంటనే చేసివేశాడు. పశువుల దగ్గర మనుష్యుల్ని కాపలాపెట్టాడు. ఎందుకంటే 'శిబూ' ముతా తన గేదెల్ని దొంగతనంగా తోలుకుపోవాలని ఆలో చిస్తున్నడని ఎవరో చెప్పారు.

ప్రతి యుగంలోనూ, ప్రతి స్థానంలోనూ వివేకబుద్ధులు గల వ్యక్తి ఒకరుగాకపోతే ఒకరైనా తప్పక వుంటూనే వుం టారు. 'బాదల్' ఇంటికి వచ్చిన అతిథులలోకూడ ఇలాంటి బుద్ధిమంతుడొకాయన వున్నాడు. ఇవన్నీ గాలికబుర్లనీ. ఎవరి నైనా నమ్మకమైన మనిషిని పెళ్ళివారి వద్దకు పంపి అసలు విషయమేమిటో తెలుసుకోవటం మంచిదనీ అతను సలహా చెప్పాడు.

'బాదల్' తాను వెళ్ళక తన పెద్ద కుమారుడైన 'బేతాలీ'ని పంపాడు.

'బేతాలీ' విడిది ఇంటికి రావడం చూచి 'శిబూ' తన పాత తిట్లన్నీ మరొకసారి తిరిగి చదవటమే గాక వాటికి మరి కొన్ని కొత్తవి కూడ జతచేసి వినిపించాడు. "ఇతని వ్యవ హార మేమిటో చూస్తా. ఇతనెంత? ఇతని గర్వమెంత? ఈ తలబిరుసుతనమంతా దిగిపోయేటట్లు చేస్తా. ఏదో పెద్ద షాహుకారులా పోజులిస్తూ తిరుగుతున్నాడు. ముక్కు తెగ కోయించకపోతే—వీడి గౌరవమర్యాదలన్నీ మట్టిపాలు చేయిం చకపోతే అప్పుడనమను. పో ఇక్కణ్ణుంచి. తన కూతురికి తన యిష్టంవచ్చినచోట మరోసంబంధం ఏర్పాటుచేసుకోమని చెప్పు.

మీా అమ్మాయి మా ఇంటిగుమ్మం తొక్కాల్సిన పనిలేదు.
మళ్ళీ ఇంకెప్పుడైనా ఇక్కడికి వచ్చాడా అంటే ఇంకేమీ లేదు, చెప్పుతీసుకుని నెత్తిబొచ్చు రాలేటట్లుగా కొడ్తా."

'బేతాలీ' ఇంటికి తిరిగొచ్చి 'శిబూ' మహాశయుడన్న మాటలన్నీ ఒక్కటికూడ బీసుపోకుండా తండ్రికి చెప్పి వినిపించాడు. "నాన్నా! నలుగుర్ని పొడిచి తర్వాత స్వయంగా పొడుచుకొని చావాలని బుద్ధిపుడుతోంది. ఈ బద్మాషుల్ని పాతచెప్పులతో సింగారించి వూరు దాటకొట్టకపోతే తర్వాత మనం బ్రతికినా, బ్రతకకపోయినా ఒకటే" అన్నాడు ఆవేశంతో 'బేతాలీ'.

దీనిమీాదట 'బాదల్' కూడ తన బూతుల పంచాంగాన్ని విప్పి ఒక ఘడియవరకు చదివాడు. ఈ చదివినవన్నీ టీకా తాత్పర్య, భాష్యముల సమేతంగా పెళ్ళికొడుకువారి వద్దకు చేరాయి. ఇంతేకాదు, చెప్పులతో నాలుగు వడ్డించి వూళ్ళోంచి అవతలకు ఈడ్వటానికి వస్తున్నారనికూడ ఎవరో ఒక ప్రబుద్ధుడు వెళ్ళిచెప్పాడు.

చెప్పుదెబ్బల సన్మానంతో నైతే పెళ్ళిపెద్దలు సాగనంపబడలేదుగాని, పెళ్ళివారికి నీళ్ళు - నిప్పులు మాత్రం బందుచేయబడ్డాయి. వీటితోపాటు తదితర మర్యాదలూ మాయమైపోయాయి. 'బకౌల్' గ్రామంలో ఒక్క నుయ్యి కూడ లేదు. ఊరంతా ఏటికెళ్ళి నీళ్ళు తెచ్చుకోవలసిందే. అందువలన పెళ్లివారు నీళ్ళకోసం చాల ఇబ్బంది పడవలసి వచ్చింది.

గాని ఈ యిబ్బంది ఎంతోసేపు వుండలేదు. ఇసుపతూలలోవున్న పెద్ద మనుష్యుల వ్యవహారం చక్కదోయటానికి చేసిన ప్రయత్నాలేమీ ఫలించలేదు. అప్పుడు 'శిబూ' పెళ్ళి పెద్దల్ని తీసుకుని నది ప్రక్కగా 'పలాధర్' కొండ క్రిందగా అడవిదారిన స్వగ్రామానికి బయలుదేరాడు. ఆదారి చాల ఇరుకైనదారి. ఐనా ఆ దారినే వెళ్ళవలసివచ్చింది. ఎందుకంటే 'బరాల్'కు దిగువున ఏరు చాలవెడల్పుగాను ఇసుకపర్రల భాగంకూడ వైశాఖ మాసంలో సయితం నీళ్ళతో నిండి లోతుగావుంటుంది. అక్కడ ఏరు దాటాలంటే 'బరాల్' గ్రామం పడవవాడెవడూ ఒప్పుకోడు. అందుచేత అడవి దారిన పోయి 'బజటా' గ్రామానికి తిన్నగా ఏరు దాటాడు 'శిబూ' అచ్చట పరస్పరం నమస్కారాలు చెప్పుకొని పెళ్ళిపెద్దలంతా తమతమ గ్రామాలకు ఇండ్లకుపోయారు.

అన్ని కష్టాలనుండి గట్టెక్కి ఇంటికిచేరిన తర్వాత 'బాదల్' గాడికి తగినశాస్తి చేసివచ్చాను. ఇప్పుడిక తన కూతుర్ని తన నెత్తినపెట్టుకు వూరేగమను, లేదా ఇంకెవ్వడికైనా యిచ్చి ముడివేయమను" అని ఏదో గొప్ప విజయం పొంది వచ్చిన మనిషిలా మాట్లాడాడు.

దేవసింహుడు ఇదంతా మౌనంగా చూస్తూఉన్నాడు.

## 2

దేవసింహుడు మంచి బలమైన మనిషి. 'చిరగ్రామం'లో ఒక కాయస్థ మాస్టరుదగ్గర కొద్ది గొప్పగా చదువుకున్నాడు. పశువులకాపరితనం అతని స్వభావాన్ని 'కల్పనామయం' చేసి

వేసింది. తండ్రికి మొదటినుంచీ కొడుకువిషయంలో ఆటే జాగ్రత్తగాని, శ్రద్ధగాని లేదు, అందువలన దేవసింహుడు స్వేచ్ఛాస్వభావుడుగా తయారయ్యాడు. తండ్రికెంత గాఢమైన ప్రేమవున్నా అది అతని స్వాభావిక సంకోచాన్ని రవ్వంతకూడ తగ్గించలేక పోయింది. ఎప్పుడైనా నలుగురు మనుష్యుల్లో కూర్చునే అవకాశం లభించినా పెద్దగా మాట్లాడేవాడుకాడు కాని ఒంటరిగా వున్నపుడుమాత్రం గొంతువిప్పి దిట్టంగా పాటలు పాడేవాడు.

ఏటిప్రక్కన 'శిబూ' కు కొంత లంకభూమి వుంది. దానిలో సంవత్సరానికి తిండి; ఖర్చులకు సరిపడే ఫలసాయం వచ్చేది. పాడి సమృద్ధిగావుంది. నేతి డబ్బుతోనే 'చిరగ్రామం' జాగీరుదారుగారి శిస్తులు సకాలానికి చెల్లించి వేయగలిగే వాళ్ళు. పైగా ఇంట్లో గురుగుముంతలో పెట్టి దాచుకోటానికి కూడ కొంతమిగిలేది.

పశువుల్ని సాయంకాలం తోలుకొచ్చి దొడ్డిలో కట్టడంతో దేవసింహునకు ఆనాటి పనంతా పూర్తి అయి పోయినట్టే. ఆ తర్వాత పనులు పాడిగేదెలకు నీళ్ళూ పాళ్ళూ పెట్టడం, పాలు పితికించడం – చూడ్డానికి చాలమంది నౌక ర్లున్నారు. ఐనా దేవసింహుడు కొంత కర్తవ్య బుద్ధితోనూ, మరికొంత చేయాలనే సర్దాతోను పశువులనుగురించి శ్రద్ధతీసు కునేవాడు.

పెళ్ళికివెళ్ళటం, తగాదాలతో తిరిగిరావటం వైశాఖమాసం లోనే జరిగిపోయింది. అప్పుడే జ్యేష్ఠమాసం జోరబడింది. సూర్యాస్తమయసమయం. ఊరికి ఒకటి రెండుమైళ్ళ దూరంలో

ఏటివొడ్డుకెళ్లి కూర్చున్నాడు దేవసింహుడు. ఈ ప్రదేశమి ప్పుడు 'భగ్రాల్' రేవుయని పిలువబడుతోంది. ఏటికి అవతల ప్రక్కన కొద్దిదూరంలో 'భగ్రాల్' అనే గ్రామం వుంది. ఆవ్వూరి పేరుమీదనే ఈ రేవుకీ పేరువచ్చింది.

ఏటికి అవతలవొడ్డున నానారకాల చెట్లు - చేమలు, గడ్డి మొదలైనవాటితో నిండినకొండలు గుట్టలు క్రమంగా క్రమ్ముకొస్తున్న చీకటిలో ఒక విశాల, అస్పష్టరేఖలా కన్పడు తున్నాయి. దట్టమైన అడవి. అందులో చిగిర్చిన ఆకులులేనిమర్రి చెట్లు కొద్దిపాటి ఎరుపు వాక్కాయి చెట్లమంచి పచ్చదనం రెండూ కలిసి మలినవస్త్రం పైన ఆవరించి వున్నట్లు వున్నాయి. ఏటిలోనీళ్ళకోడికూస్తోంది. ఏటిఒడ్డు చెట్లమీద కోకిల "కూకూ" అంది. నదిలో చేపలు ఎగిరెగిరి గంతులువేస్తూ గల్లంతు చేస్తు న్నాయి; మొసలి పొడినేలనుంచి ప్రాకుతూ పోయి నీళ్ళలో మునిగిపోయింది. సూర్యుడ స్తమించాడు.

ఒక పరిశుభ్రమైన ప్రదేశంలో కూర్చుని కూనిరా గాలు ప్రారంభించాడు దేవసింహుడు. కాని పాటలు ఎంతో సేపు పాడలేదు. ఒకటి రెండు నిమిషాల అనంతరమే మాని వేశాడు.

"నేను జీవించి వుండగానే ఆ అమ్మాయిని మరొక యింటికి పంపటమనేది పూర్తిగా అసంభవం. కాని ఏంచే యను? ఇక్కడికెంతో దూరం లేకపోయినప్పటికీ అక్కడికి వెళ్ళటం సాధ్యంకాదు." అని ఆలోచిస్తూ ఒక దీర్ఘ నిట్టూర్పు విడిచాడు.

మౌనంగా కొంచెంసేపు అలాగే కూర్చొనివున్నాడు. ఇంతలో పేరుపెట్టి పిలుస్తూ 'శిబూ' అచ్చటికొచ్చి చేరాడు. అతని పిలుపుకు ప్రత్యుత్తరం వచ్చినా అతను నెమ్మదిగా దేవసింహుని వద్దకు వచ్చాడు

"పదరాబాబూ ఇంటికి పదరా, చీకటిపడింది. ఇక్కడ వొక్కడవే కూర్చుని ఏం చేస్తున్నావురా?"

"ఇవ్వాళ ఒంట్లో బాగుండలేదు. అందుకని కాస్త షికారుగా ఇటొచ్చి కూర్చున్నా. నే వస్తున్నాలే; మీరు పదండి." అన్నాడు దేవసింహుడు.

"వాళ్ళు తమ కూతురికి మరొక సంబంధం కుదుర్చుకొంటున్నారట. అందుకు నీకేమైనా విచారంగావుందా ఏమిటిరా? ఎందుకురా విచారం? నీకు కావాలంటే ఈ నెలలోనే అటువంటివి ఒకటికాదు, రెండుకాదు, పది పెళ్ళిళ్ళుచేస్తారా. అదీగాక కాస్త మంచి సాంప్రదాయం గలవాడెవ్వడూ ఆ అమ్మాయి తన యింట్లో పాదంపెట్టడాన్కి అంగీకరించడు. చివరకు పనిపాటలు లేకుండా కన్నాలువేసే, జేబులు కత్తిరించే దొంగవెధవ ఎవడో దొరుకుతాడు" అన్నాడు 'శిబూ' నవ్వుతూ.

ఇంటికి బయలుదేరి పోతూపోతూ "ఆ బోసిముక్కు 'బాదల్'గాడి మిడిసిపాటుకాస్తా వదలిపోయేటట్లు చేయాలిలే. ఏదో పెద్ద గౌరవంగల మనిషిలా తిరుగుతున్నాడులే. ఇప్పుడు తెలిసివస్తూవుండొచ్చు. కూతురికి సంబంధం కుదర్చటానికి తల ప్రాణం తోకకువస్తూవుండొచ్చు" అన్నాడు "శిబూ."

దేవసింహుడు సమాధానమేమీ చెప్పలేదు. తండ్రి

మళ్ళీ "ఇవ్వాళ 'బరాల్' వాళ్ళను గురించి అందిన సమాచారం నాకేమీ ఆశ్చర్యం కలిగించలేదు. ఎందుకంటే వాళ్ళను లెక్కచేయకుండా ఆవూరు వదలివచ్చిన రోజుననే మరోసంబంధం చూచుకోమని చెప్పివచ్చాగా. ఇప్పుడిక గత్యంతరంలేక కాళ్ళకు బలపాలుగట్టేటట్టుగా సంబంధంకోసం తిరుగుతున్నాడు" అన్నాడు.

శిబూ ముసిముసిగా నవ్వుకొన్నాడు.

'బాదల్' చౌధరి తన కుమార్తెకు మరోసంబంధంచేయ నిశ్చయించుకున్నాడని నేడు 'బరాల్' నుండి ఒకవార్తఅందింది. ఇదే అతని ప్రసన్నతకు కారణం.

ఈ విధంగా మాట్లాడుకుంటూ తండ్రి – కొడుకులు నడచిపోతున్నారు. ఇల్లు ఇక కొద్దిదూరం వుండగా "మన కులంలో ఇలాంటి ఆచారం మొదటినుంచీ వుందా?" అని ఎంతో నిర్లక్ష్యభావంతో అడిగాడు దేవసింహుడు.

"మొదటినుంచీ లేకపోయినప్పటికీ నేనుమాత్రం ఆరోజునే మీ అమ్మాయి మాకింక అవసరంలేదనీ, మీ యిష్టమొచ్చినచోట యిచ్చుకోమని చెల్లుచీటీ నిచ్చివచ్చా. అదీగాక మనకులంలో చాలమంది ఇలా చేస్తున్నారుకూడ. కాని శాస్త్ర సాంప్రదాయంకలవారు మాత్రం ఎన్నడూ చేసుకోలేదు. అలా జరిగిననాడే ఆరాక్షసుని తల సిగ్గుతో నేలకెళ్ళి కొట్టుకుంటుంది. మనం కంగారుపడాలనీ, దీనత్వంతో ముఖం వ్రేలాడ వేసుకుని చేతులు జోడిస్తూ వాడిదగ్గరకుపోయి తప్పులు క్షమించి కూతుర్ని కాపరానికి పంపమని అడగాలనీ అన్నవుద్దే

శ్యంతోనే వాడు మనకీవార్త అందచేశాడు." అన్నాడు అదే విధమైన నిర్లక్ష్యభావంతో.

ఇంటి దరిదాపుకు చేరుకున్నప్పుడు "ఈ రకమైన ఆలోచనయే వాడి నీచత్వం. చేతగానితనం దానంతటదే వెల్లడి చేస్తోంది" అన్నాడు 'శిబూ' కొంచెం కఠోరస్వరంతో.

సరిగ్గా వినీ వినిపించనిస్వరంతో "ఈ వార్త తెచ్చిన వాడెవడేమిటి?" అని ప్రశ్నించాడు. దేవసింహుడు.

"ఎవడైతేనేం? ఎవడో దారినపోయే దానయ్య అనుకో ఆవచ్చినవాడినీ ఊరికే పోనివ్వలేదులే. వాడికీ నాలుగు గట్టిగానే వినిపించి పంపించాలనే చేశానులే." అన్నాడు 'శిబూ'

"ఇంతకూ అతనసలు ఏవూరివాడు?"

"ఏమో, ఏవూరివాడో? వచ్చాడు, వెళ్ళిపోయాడు."

# 3

షుమారు రాత్రి పదిగంటలకు వెన్నెలవచ్చింది. చల్లటి గాలి వీస్తోంది. 'బజటూ' వంటి చిన్నగ్రామం అప్పుడే నిద్రాదేవి వొడిలోకి చేరి విశ్రాంతి తీసుకొంటోంది. ఒక్క దేవసింహుని నేత్రాలు మాత్రమే నిద్రాదేవికి దూరంగా వున్నాయి.

దేవసింహుడు మొదట నెమ్మదిగా దగ్గాడు. తర్వాత మళ్ళీ ఒకసారి బిగ్గరగా దగ్గాడు. ఎవరూ మేల్కొనివున్నట్లు కనిపించలేదు. ఒక పేష్కత్తి బొడ్డులో పెట్టుకొని చేతిలో ఒక బాణాకర్రతీసుకొని చడీచప్పుడు కాకుండా బైటికి నడచాడు.

ఆ మిణుకుమిణుకు వెన్నెలవెలుగులో అడవీ, కొండలు చిందరవందరగా పడివున్న గుడారాలుగా దృష్టిగోచర మవుతున్నాయి.

దేవసింహుడు మొదట 'బేతవా' నదికి ఇవతల పక్కగా గండ్లు, గోతులు, పొదలు, ముళ్ళు, రాళ్ళు, గుట్టలు దాటుతూ కొంతదూరం నడిచాడు. తర్వాత ఏటిలోగుండా వెళ్ళటానికి అనువైనచోట ఒడ్డుక్రిందికి దిగి 'బరౌల్' వైపుకు సాగిపోసాగాడు. నది అచ్చటచ్చట ఇప్పుడుకూడ ఎన్నో చిన్న చిన్న పాయలుగా చీలి, ఎత్తైయిన కొండరాళ్ళమీద నుంచి 'బడబడ' మని ధ్వని చేసుకుంటూ ముందుకు పరుగెత్తుతోంది. ఆపాయలన్నీ దాటి ఒంటిగంటయ్యేటప్పటికి 'దేదర్' గ్రామానికి తిన్నగా వెళ్ళి చేరాడు. దానికి సరిగ్గా ఎదురుగా అవతలి వొడ్డున 'బరౌల్' గ్రామంవుంది. ఇంకా ఏరు అంతా ఈదటానికి అలాగే పడివుంది.

రాకేశుడు తన శ్వేతకిరణాలను ఇసుకతెన్నెలమీదికి విరజిమ్ముతున్నాడు. ఆ తిన్నెమీద కూర్చొని దేవసింహుడు ఆలోచించసాగాడు — "ఇల్లొదిలి ఇక్కడికొచ్చి ఆశే మంచి పనిచేయలేదు. నాన్నగారు లేచినపుడు నేను కనపడకపోతే ఏమనుకొంటాడు? ఏరు దాటాలంటే కనీసం ఇంకొక గంటయైనా పడుతుంది. మళ్ళీ తిరిగిరావటానికి యింతేసైం పడుతుంది. మళ్ళీ ఇక్కడే ఏరుదాటకుండా అవతలిగట్టున ఏటి ప్రక్కగా నడచి 'భ్రౌల్' మీదుగా ఇంటికి త్వరగానే చేరుకోవచ్చు. కాని ఖర్మంచాలక ఈ లోపలే వూళ్ళో వెదకటం

గితకటం ప్రారంభమైతే ఇంటికెళ్ళినతర్వాత ఏమని చెప్పాలి? ఎక్కడికెళ్ళానని చెప్పాలి?"

తిరిగి యింటికి పోవటమే మంచిదని ఒకసారి అభిప్రాయ పడ్డాడు దేవసింహుడు. కాని మళ్ళీ ఏదో కోరికకలిగింది. మళ్ళీ ఆలోచించసాగాడు "ఏ విషయం గట్టిగా తెలుసుకురావాలని బయలు దేరానో అది తెలుసుకోకుండానే తిరిగి వెళ్ళిపోవటం గొప్ప బలహీనతయని చెప్పాలి. ఈ నదీజలం ప్రవాహంగులు గాని, లేక ఇందులో దాగివున్న జలజంతువులుగానీ నన్ను భయభీతునిచేయగలవా? నీళ్ళు చల్లగానేవున్నాయి. ఈద టానికి సర్దాగావుంటుంది. చూస్తూచూస్తూనే ఒక దెబ్బన ఆద తికెళ్ళిపడ్తాను. బహుకొద్ది సమయంలోనే ఏదో ఒకటిచేసి అవ తలివైపుగానే పరుగున ఇంటికిపోతాను. ఎంత దూరమున్న దేమిటి? అంతాకలిసి రెండు, రెండున్నరకోసుల దూరమేగా."

దేవసింహుడు ఇలా ఆలోచించి గభాలున నీటిలోకి దూకాడు. ఇచ్చట ఏరు చాలవెడల్పుగా నీళ్ళు విస్తరించివుండ టంవల్ల వర్షాకాలంలోకూడ పెద్ద వడిఏమీావుండదు. ఇక ఎండాకాలంలో వెడల్పుగా పెద్దకొలనులా కనపడుతుంది.

ఒక గంటకన్న తక్కువ కాలంలోనే దేవసింహుడు నది ఈదుకుని అవతలికిచేరాడు. కాని దిబ్బమీాదికెక్కగానే ఒక మాట తలపుకువచ్చి మనస్సును కొంచెం కలవరపెట్టింది. అది ఇంతకుపూర్వం ఇల్లొదిలి యింతదూరం వచ్చినా దారిలో ఎక్కడా తట్టి, యింతెక్కువగా కలవరపెట్టలేదు.

"ఎవరి దగ్గరకెళ్ళాలి? ఎవరి నడగాలి? ఏవిధంగా అడగాలి?"

వెన్నెలతో ఆడుకుంటున్న అలలుచూస్తూ ఒక అర ఘడియసేపు ఆ ఏటిదిబ్బమీద కూర్చొన్నాడు దేవసింహుడు. ఊరు ఏటిఒడ్డుకు వంద, వందన్నరగజాల దూరంలో వుంది. ఊళ్లో అడవిజంతువుల అరపులకు జవాబుగా కుక్కలు అరిచే అరుపులు మినహా మరేచప్పుడూ వినరావటం లేదు. పెళ్ళికి ముందెన్నడూ ఆగ్రామానికి వెళ్ళలేదు దేవసింహుడు. పెళ్ళి సందర్భంలో ఆవూరిలో వున్న రెండురోజులలో చూచిన దంతా ఇప్పటికీ బాగా జ్ఞాపకం ఉంది. ఆతర్వాత కూడ అనేకసార్లు తాను చూచినదాన్ని గురించి ఆలోచించాడు కూడ. ఈకారణంచేత అత్తవారిల్లు బాగానే గుర్తు వుంది.

రేవుదగ్గరనుంచి లేచి గ్రామంవైపుకు నడిచాడు. ఒక ఇంటిగుమ్మందగ్గరకు చేరగానే కాళ్ళు అప్రయత్నంగానే ఆగి పోయాయి. ఇంతదూరం ఏశక్తి తన్ను లాక్కొని వచ్చిందా యని ఆలోచించి ఆశ్చర్యపడసాగాడు. అడుగుముందుకువడటం లేదు. కుక్కలదృష్టి పడింది. చుట్టూచేరి మొరగసాగాయి. అచ్చటనుంచి నెమ్మదిగా పోయి ఒక రావిచెట్టుక్రిందకెళ్లి నిల బడ్డాడు. ఆ చెట్టుక్రింద చిన్నిఅరుగుమీద ఏవోకొన్ని దేవుళ్ళ విగ్రహాలు ఉన్నాయి. కుక్కలచూపు అతనిమీదనుంచి మరో వైపుకు మరలింది. దాంతో అతన్ని వెంబడించటం మాని మరోదిక్కుకు పోయాయి.

గాలి చల్లగా ఉంది. ఒంటిమీది బట్టలు తడిసి ఉన్నాయి. కాని దేవసింహుని మొగం నుంచి చెమటలు కారు తున్నాయి. ఆలోచిస్తున్నాడు. "ఇక్కడికి రావలసిన అగత్యమేమిటి? ఆ అమ్మాయి తండ్రి అదుపు ఆజ్ఞల్లో వుంది.

ఇక కొద్దిరోజుల్లో మరొకనికి చెందిపోతుంది. కాని ఇందులో ఆపిల్ల తప్పుగాని, లేక పిల్లతండ్రి తప్పుగాని ఏముంది? మేం వదిలేశాం ఇక మాకేం సంబంధంలేదు, మీాయిష్టమొచ్చిన చోట మళ్ళీ చేసుకోండి అని ఆరోజున పెళ్లినాడే స్పష్టంగా చెప్పి వేయబడిందిగదా. మరొకచోట చేయటమా! అసంభవం!!"

ఇదంతా ఆలోచించగానే తండ్రిగారి ముఖాకృతి అంతా అతని కళ్ళముందుకొచ్చి ప్రత్యక్షమైనట్టుగా కన్పడింది. గజగజ వణకిపోయాడు. 'ఇక్కడికేం పనిమీాద వచ్చావురా' యని అడగబోతున్నట్లుగా కన్పించింది. కాని నిజంగా అక్కడెవ్వరూ లేరు. అదంతా కేవలం కల్పన, లేక దృష్టిదోషం మాత్రమే.

"నాన్న తప్పకుండా మేల్కొనేవుండొచ్చు. నన్ను నలుదిక్కుల వెదకుతూండొచ్చు. చాల తెలివితక్కువ పని చేశాను ఇక్కణ్ణుంచి వెళ్ళిపోవటమే మంచిది" అనుకున్నాడు.

బయలుదేరిపోవటానికి సంసిద్ధుడయ్యాడు. మళ్ళీ ఒకసారి 'బరొాల్' వూరి ఇండ్లకేసి చూచాడు. వాటిలో ఒకటి కొంచెం ఎక్కువ ఎత్తుగాను, కొంచెం పెడగాను వున్నట్టు కన్పడింది. దానిలో ఒక అంతస్థు, ఆ అంతస్థులో ఎవరో ఒకరున్నట్టుగా వూహించాడు. దీర్ఘంగా ఒకసారి నిట్టూర్చి మళ్ళీ యథాప్రకారంగానే నిలబడిపోయాడు.

తడిబట్టలకు చల్లగాలితోడైతే ఇక వేరే మంచుగడ్డ అవసరంలేదు. కాని దేవసింహుని దేహమంతా వెచ్చగా మండిపోతోంది. మొఖంమీాది చెమట తుడుచుకొని ఏదో ఒక నిర్ణయానికొచ్చాడు.

"ఆరునూరైనాసరే, ఒకసారివెళ్ళి ఇల్లన్నా తప్పక చూచివస్తా."

పెండ్లికొచ్చినపుడు ఆ వున్న రెండు రోజులూ పెళ్ళివా రంతా ఏదారిన, ఏబజారున రెండు మూడుసార్లు పెళ్ళివారింటి కెళ్ళి వచ్చారో, తదితరులుకూడ ఏదారిన ఆ యింటికెళ్ళి వచ్చారో ఆ దారినే ఆ యింటి వైపుకు త్వరత్వరగా నడిచాడు దేవసింహుడు.

ఇంటి గుమ్మం గుర్తుపట్టాడు. పెళ్ళిరోజున కట్టిన తోర ణాలు ఇప్పుడూ అలాగే వ్రేలాడుతున్నాయి మధ్యమధ్యలో నేరేడుయాకులు గుచ్చినచోట్ల మాత్రం కొద్దిగా ఎండిపోయా యేగాని తతిమ్మా భాగమంతా పచ్చపచ్చగానేవుంది. చిత్ర కారుడు గోడలమీద గీసిన బొమ్మలు ఇప్పటికీ చెక్కుచెదర కుండా అలాగేవున్నాయి.

ఈ తోరణాలు త్రెంచి దూరంగా పారవేయనంతవరకు అసలు మరొకచోట యిచ్చి పెళ్లి ఎలాచేయగలడు? ఈ తోర ణాలక్రిందగానే అనేకసార్లు ఈ ఇంటిలోకి వెళ్ళాను, వచ్చాను. ఆ అమ్మాయికూడ దీని క్రిందగానే రోజూ ఇంట్లోకి, బైటకి తిరుగుతూవుండొచ్చు. ఇప్పుడు నేనిక్కడ నిల్చొని వున్నాను. గొళ్ళెం కాస్త గణగణా మ్రోగించటమే తడవు, లోపలనుంచి సమాధానం తప్పక వస్తుంది. ఎవరినుండి? ఇంకెవ్వరినుండి? ఏవ్యక్తి నాతండ్రిని నానా దుర్భాషలాడాడో అతనినుండే వస్తుంది. ఏవ్యక్తి పెళ్ళివారినందర్నీ చెప్పులతో సింగారించి వూళ్ళోనుంచి బైటికి గెంటేస్తానన్నాడో అతనినుండే వస్తుంది. కాని ఆహా! ఆముఖం! ఆలావణ్యం!! ఆ కోమలత్వం!!! పాపం

ఇందులో ఆ అమ్మాయి తప్పేముంది? ఏ తప్పుకుగాను శిక్షింపబడనున్నది? ఆవిడ మనస్సులో ఏ మూలనైనా అంగుళం మేరకైనాసరే నాకోసం స్థానంవుంటుందా? లేకపోవచ్చు! లేకపోవచ్చు!! ఒకవేళ లేకపోవటమే నిజమైతే అప్పుడిక అసలు సమస్యేలేదు. కాని ఒకవేళ వుంటేనో? మరి అప్పుడు ఆ అమ్మాయిని బలిచేయటం దేనికి? అగ్నికి ఆహుతి చేయటం ఎందుకు? స్వయంగానే చేతులతో ఎందుకలా కానివ్వాలి?"

ఇంతలో వూళ్ళో ఎక్కడో ఒకమూల కుక్కలు మొరిగాయి. అదివిని దేవసింహుడు ఆలోచించసాగాడు—"ఎవరో వస్తున్నట్టుగావుంది. ఎవరామనిషియని అడిగితే ఏమని సమాధానం చెప్పాలి? మొదట్లో అందరూ దొంగ దొంగయని అనుస్తారు తర్వాత పట్టుకుంటారు. 'బాదల్' చౌధరి వస్తాడు. బావమరుదులంతా వచ్చి ప్రోగవుతారు. ఇక మాటలకు కొరత ఏముంటుంది? ప్రతీకారం చేయటానికి మంచి అవకాశం దొరికిందని పట్టుకు కట్టేస్తారు. నాన్నగార్కి తలవంపులు కలుగ చేయాలన్న దురుద్దేశ్యంతో 'ఇదిగో' నీ సుపుత్రుడు పెళ్ళాన్ని తీసుకెళ్ళాలని నీకు తెలియకుండా వచ్చాడు చూడమని ఇంటికి వార్త పంపిస్తారు."

అటు చంద్రునికేసి చూస్తే ఇక తెల్లవారటానికి మూడుగంటలకన్న ఎక్కువ పొద్దులేదని తెలిసింది.

అచ్చటనుంచి గభాలునలేచి వెనక్కి తిరిగాడు దేవసింహుడు. ఊరుదాటివచ్చి అంగలార్చుకుంటూ, అడవులు, గుట్టలు మెట్టలు దాటుతూ తెల్లవారకముందే తనయింటికి చేరుకున్నాడు.

అందరూ ఇంకా నిద్రమంచాలమీాదనే వున్నారు.

దేవసింహుడు చడీచప్పుడు గాకుండా తన పక్కమీాద కెళ్లి పడుకొన్నాడు. కాని నిద్రపట్టలేదు. కొంచెంసేపటికి గుండె దడ తగ్గింది. తానుచేసినపనికి పశ్చాత్తాపమేమీా కల్గ లేదు. నడిచింది కొంచెంసేపేగాని చాలా నడిచాడు; చాలా తిరిగాడు. ఐనా యేమిటి ప్రయోజనం? ఏసంగతీ తెలుసుకో కుండానే తిరిగి వచ్చాడు. ఇదొక్కటే కొరతగా కన్పడింది.

తెల్లవారింది, శిబూలేచాడు. చూస్తే కొడుకు మేల్కొని వున్నాడు, లేచి చాలసేపు అయిందా ఏమిటని అడిగాడు.

"లేదు, ఇప్పుడే లేచాను." అన్నాడు దేవసింహుడు. కాని ఆ మాటలతోపాటు మొగంకాస్త ఎర్రబారింది. తన తండ్రితో అబద్ధం చెప్పటం ఇదే మొదటిసారి.

# 4

'శిబూ' మహతోనూ, తదితర పెండ్లి పెద్దలను నానా దుర్భాషలాడి వూరు బయలుదేరగొట్టిన తర్వాత 'బాదల్' చౌధరికి మనశ్శాంతి కలిగిందా అంటే అదేమీాలేదు. రెండు మూడు రోజుల తర్వాత కోపం శాంతించింది. ఇదేరకంగా వియ్యంకుని మనస్సుకూడ ఏదో ఒకరోజున నిర్మలమవుతుందిలే అనుకున్నాడు. తండ్రి కోపం చల్లారినా కొడుకు 'బేతాలీ' కోపం మాత్రం చల్లారలేదు. ప్రత్యేక కారణాలులేక ప్రత్యేక పరిస్థితులు సంభవించినపుడు వాళ్ళ కులంలో కొందరు తమ ఆడపిల్లలకు భర్తలుండగానే మరొక సంబంధంచేసిన ఘటనలు

వున్నాయి. ఇవన్నీ బాదల్ కుటుంబీకులకు తెలుసు అందు వలన తాముకూడ ఆ మార్గాన్నే పోవాలని గట్టిగా నిర్ణయించుకు కూర్చున్నాడు పెద్ద కొడుకు 'బేతాలీ'.

నాలుగైదు నెలలు గడచిన తర్వాత ఉభయపక్షాల మనస్పర్ధలు పూర్తిగా తగ్గిపోయినపుడు 'శిబూ' తన కోడల్ని తీసుకెళ్ళతాడని బాదల్ చౌధరికి కొద్దిగా ఆశవుంది. అప్పుడు వంద రేడెలు గాకపోతే ఏభైకొన్ని అయినా తప్పక ముట్ట చెప్పవొచ్చు.

పెద్దకొడుకు చాల పట్టుదలగల మనిషి. అతనిమాటను కాదనదలచ లేదు తండ్రి బాదల్. పెళ్ళివారు తరలిపోయిన పది రోజులకు చెల్లికి మరో పెళ్లి చేయాలని 'బేతాలీ' తండ్రితో చెప్పాడు. బాదల్ వ్యతిరేకించలేదు. తగిన పిల్లవాణ్ణి చూడమనీ. ఈ సంగతి 'శిబూ'కు కూడ తెలియచేయమనీ కూడ చెప్పాడు. ఇలాచేస్తే 'శిబూ' కోపతాపాలతో మండిపోతాడని కొడుకు అలోచిస్తే యీకబురందగానే గుండెలు కరిగిపోయి కోడల్ని తీసుకెళ్ళటానికి ప్రయాణం చెప్పి పంపిస్తాడని 'బాదల్' భావించాడు. కాని 'శిబూ' దగ్గరనుంచి వాంఛించదగిన అనుకూలమైన సమాధానమేమీ రాలేదు.

ఇది చూచి అప్పుడిక వరుడుకోసం వెదకులాటలూ ప్రారంభించారు. ఎక్కడికో పోకుండా పక్కవూళ్ళోనే దొరికాడు. 'బారాల్' గ్రామానికి ఒక మైలుదూరంలో 'పహాడీ' అనే గ్రామం వుంది. ఆవూళ్ళో ఒక సామాన్య గృహస్తుని కొడుకు ఒకడు 'రామూ' కొరకు ఎన్నుకోబడ్డాడు. వయస్సు ఇరవైమూడు, ఇరవైనాలుగు వుంటుంది. చిన్నతనంలోనే ?వా

హామైంది. కాని భార్య చనిపోయింది. ఎర్రటి దేహం. కొంచెం నాజూకుగానే వుంటాడు. కళ్ళు కొంచెం లోతుగావుంటాయి. లలాటం చిన్నదైనా నునుపుగా వుంటుంది. కొంచెం దూరం గావుండి చూస్తే మాత్రం అందంగానే కన్పడతాడు. కాని దగ్గరికెళ్ళిచూస్తే ఆలోతైన కళ్ళూ, ఆ లావాటి ముక్కూ అంద చందాలను చెడగొడ్తూంటాయి. ఎల్లప్పుడూ రంగురంగుల తలగుడ్డనే చుడుతూంటాడు. దుస్తులూ శుభ్రమైన వేధరిస్తాడు అందువల్ల లోపల పెద్దగా ఆ స్థిపాస్తులు లేకపోయినా ఇతను తన చెల్లికి తగిన వరుడని 'బేతాలి'కి నచ్చింది.

బాదల్ చౌదరి కూడ వ్యతిరేకించలేదు. చివరకు ఏవం కనూ చూపించలేదు. కాని తనవంశంలో ఈవిధంగా ఎన్నడూ జరగలేదే అన్న మాటొక్కటే అప్పుడప్పుడు మనస్సులో కాస్త కలతపెడుతూండేది. ఐనా దీన్ని బైటికి వెల్లడించలేదు. ఇందుకు కారణమేమంటే కొంతమంది స్వకులస్థులు వచ్చి అదిగో అక్కడచూడు; ఇదిగో ఇక్కడచూడు; ఆపెద్దపెద్ద వాళ్ళు చేయలేదా? అని ఉదాహరణపూర్వకంగా కబుర్లు చెబుతూండేవారు. ఆ 'పహాడ్' గ్రామంలో చూచిన వరుని పేరు 'పన్నాలాల్'. ఆవూళ్ళోవాళ్ళు చాలమంది స్త్రీలు పురుషులు అతన్ని 'పన్నా' 'రసికుడు' అనికూడ పిలుస్తోం టారు.

'పన్నా' రసికుని నిశ్చయం చేసినప్పటికీ 'బాదల్' అతనికీవిషయం మాత్రం చెప్పిపంపలేదు. దీనికి కారణా లున్నాయి. కబురుచేసినందువల్ల రహస్యమంతా వెల్లడై అందరికీ తెలిసిపోతుంది. దూరదూరానవున్న చుట్టపక్కా

లంతా ఇది మంచిదని కాదని విమర్శించవచ్చు. ఇది మొదటి కారణం. 'పన్నా' ఇంటికి ఇలాంటి 'వర్తమానం' పంపినందు వల్ల తేలికై పోవచ్చు. దీనివల్ల లోకంలోని చిన్నరకంవాళ్ళ కళ్ళు నెత్తికెక్కవచ్చు. ఇది రెండో కారణం. కన్యా దానంతోపాటు కట్నంగా చాలగేదెల్ని గనక కోరితే, సంబంధం ఖాయంగాకపూర్వమే తమ 'వర్తమానం' అంగీకరించబడక పోతేచాల అవమానం జరుగుతుంది. ఇది మూడో కారణం.

ఇవన్నీ దృష్టిలో పెట్టుకొని ఏదో ఒక శుభసమయాన్ని పురస్కరించుకుని త్వరలోనే పన్నాలాల్‌ను ఇంటికి భోజనానికి పిలవాలని నిర్ణయించబడింది.

బుందేల్‌ఖండంలో 'గంగాదసరా' గొప్ప పండగగా భావించబడుతూంటుంది. పల్లెటూళ్ళలో ఆరోజున భోజనాలు పెట్టడం, భోజనాలకు వెళ్ళడం ఆచారం. ఆరోజున పన్నా లాల్‌ను భోజనానికి పిల్వటానికి నిశ్చయించుకొన్నారు. ఇంతకు ముందుకూడ పన్నాలాల్ 'బాదల్' చౌధరిగారింట్లో విందులకు వచ్చివున్నాడు. కాని 'గంగాదసరా' వంటి చిన్నచిన్న పండ గల్లో ఎన్నడూ ఆహ్వానించబడలేదు.

ఆ పండగ రోజువరకు యీసంగతి పన్నాలాల్‌కు తెలి యనీయకూడదని ఒట్టుపెట్టుకొన్నారు 'బాదల్' కుటుంబీకులు. కాని మరిఎలా పొక్కిందో, ఎందుకు వెల్లడయిందో తెలియ దుగాని మొత్తంమీద అనుకున్న సమయానికి ముందే పన్నా లాల్‌కు ఇది చూచాయగా తెలిసిపోయింది. అంతవరకే ఆగలా, పైగా బాదల్ త్వరలోనే తన కుమార్తెకు పునర్వివా

హం చేయనున్నాడనీ, పన్నారసికుడు అదృష్టశాలియైన వరుడు కావచ్చునని ఇంకెందరికోకూడ తెలిసింది.

ఆ రోజునుండి తనఇంటి దొడ్లో గేదెలు గుంపులు గుంపులుగావున్నట్లు పన్నాకు కలలో కన్పడసాగాయి. జుట్టుకు నూనెపూత ఎక్కువ కాసాగింది. పూర్వంకన్న ఎక్కువ అందమైన ఇంద్రధనుస్సు రంగుల తలగుడ్డ చుట్టుకోసాగాడు. తెల్లటి దుస్తులుధరించ మొదలుపెట్టాడు. ఇలా చేయసాగాడని వేరుగా చెప్పనవసరం లేదుగదా. చివరకు మాటలుకూడ మారిపోయాయి. వాటిలో కొంచెం చురుకుతనం, కొంచెం ఉల్లాసం కన్పడసాగాయి.

మరల ఈ రోజుల్లోనే పిల్లకు సంబంధం చేసుకోబోతున్నారని బాదల్ ఒక బాటసారిద్వారా 'బజటా' వాళ్ళకు తెలియజేశాడు.

కాని 'శిబూ' మాత్రం సమాధానమేమీ పంపలేదు సరిగదా పైపెచ్చు తన కుమారునకు తగిన సంబంధంకోసం శ్రద్ధగా తిరగసాగాడు.

# 5

పల్లెటూళ్ళలో జనులు స్నానసంధ్యలకు తరచు వూరి వెలుపలి జలాశయాలకు పోతూంటారు. 'రమా' కూడ అప్పుడపుడు స్నానానికి నదికి పోతూండేది. కాని కొన్నిరోజుల నుంచీ నదికి పోకుండా వూరికి దక్షిణానవున్న వాగుకు పోసాగింది. వాగు 'బకాల్'కు దక్షిణంగా 'బేతవా' నదిలోకెళ్ళి

కలిసింది. అందులోకెళ్ళి పడటానికి ఒక కొండను తొలుచుకు పోయింది. అది బయలుదేరినచోటు అడవీమైదానాలకు సంగమస్థలం. నీళ్ళు కొద్దిగానే వున్నా నిర్మలంగా, లోతుగా వుంటాయి. 'రామా' ఏటివొడ్డు వూరిపిల్ల కావటంచేత ఈతబాగావచ్చు. కాని మొసళ్ళంటే తగనిభయం. ఈ కారణంచేత ప్రస్తుతం ఏటిలో స్నానంచేయటం, ఈతగొట్టటం మాని వేసింది. మొదట్లో ఇతర గ్రామస్త్రీలతో కలిసి ఏటిలో ఈతలు వేస్తోండేది. కాని పెండ్లి అయిన దగ్గరనుంచి నలుగురితో కలిసి సర్దాగా వుండటం ఇష్టంగా వుండటంలేదు.

'గంగాదసరా' పండుగకు ఒకరోజు ముందు సంగతి. ఒక సమవయస్క స్నేహితురాలితో కలిసి స్నానానికి వాగుకు బయలుదేరింది.

వాగుకు చేరటానికి ముందు తన స్నేహితురాలితో "సుభద్రా! ఇవ్వాళ వడగాలి తీవ్రంగా వీస్తోంది. కాస్సేపు నీళ్ళఒడ్డున కూర్చొని వేడితగ్గిన తర్వాత స్నానంచేదాం" అంది.

ఏం? ఏంపని? ఎవరికోసమైనా ఎదురుచూడాలా? ప్రశ్నించింది సుభద్ర వంకరగా చూస్తూ. మళ్ళీ "అటువంటిదేమైనా వుంటే ముందేచెప్పు. నేను కాస్సేపు అవతలికన్నా పోతా. మీముచ్చట్లకు అడ్డులేకుండా అన్నా వుంటుంది." అంది.

"నీనాలుక ఏంనాలుకే? ఎప్పుడూ ఏదో ఒకటి వాగుతూనే వుంటుంది. అలా వాగుతుండగాచూస్తే దాన్ని ముక్కలు ముక్కలుగా కోసేద్దామా అనిపిస్తోంటుంది. సరే అయితే పద.

ఇప్పుడే స్నానం చేద్దాం పద. వడ తగిలితే తగులు తుందిలే”
అంది రామా ఒక గుద్దు గుద్ది.

“అబ్బా నీగుద్దూనువ్వూ పాడుగాను. ప్రాణం తీశావు గదే.” అంది సుభద్ర కోపంతో ముఖమంతాఎర్రచేసుకుంటూ. కాని మళ్ళీ నవ్వుతూ ఏటిదగ్గరకన్న వాగుదగ్గరే ఎక్కువ వీలుగా వుంటుందిలే. ఇందులో ఇంకా సందేహంకూడానా? అంది.

మళ్ళీ పిడికిలి బిగించికొని నవ్వుతూ “ఏలేంపీలే కొంటె దానా?” అంది రామా.

సుభద్ర దెబ్బ తప్పించుకుని కొంచెం పెడగా నడుస్తూ ఏదో ఒకచోటనుంచి ఎవరో ఒకరు తప్పక రానున్నాడన్న మాట మాత్రం ఖాయం. ‘బజటా’ నుంచి వచ్చేవాడెవడు న్నాడులే. ఇక వస్తేగిస్తే ఈ ప్రక్కవూరివాడే ఎవడైనా రావాలి.” అంది.

రామా కొట్టాలని సుభద్ర వైపుకు పరుగెత్తింది. కాని సుభద్ర అందకుండా ముందుకు పరుగెత్తసాగింది. ఈరకంగా వురుకుతూ పరుగెత్తుతూ ఆ వెచ్చటి వడగాలిలోనే ఇద్దరూ వాగు దగ్గరకుచేరుకున్నారు.

సుభద్రకు చాలివచ్చి రొప్పుకుంటూపోయి ఒకరాతి బండమీద చతికిలపడింది. తర్వాత “ఇదిగో రావే, వచ్చి కొట్టుకోవే. కావాలంటే చంపివేయవే, ఇక నే నెక్కడికీ పారి పోనులేవే.” అంది.

“అటువంటి మాటలు మళ్ళీ నోటిలోనుంచి రానీయవు గదా!” అంది రామా దగ్గరకొచ్చి.

"ఏం మాటలు?"

"ఏంమాటో అప్పుడే మరచిపోయావన్న మాట. ఇంత లోనే ఇంత నంగనాచివయ్యావన్న మాట."

"ఏమిటది? 'బజటా' విషయమా?" అంది నవ్వుతూ సుభద్ర. చెంపమీద దెబ్బలుపడకుండా తప్పించుకునేందుకు చేతులు రెండూ మొగానికి అడ్డం పెట్టుకుంది.

'రామా' తెల్లపోయింది. ముఖం చిన్నపుచ్చుకుని నిలబడిపోయింది. రామాను కౌగిలించుకుని "కోపం వచ్చిందా? ఐతే, ఇక ఎన్నడూ అలాంటి మాటలు అననులే." అంది సుభద్ర.

ఇది విని 'రామా'కు నవ్వు వచ్చింది. "వదలిపెట్టేసిన వూరిపేరు ఎత్తటం దేనికిలేవే. వాళ్ళు నన్ను గడ్డిపోచకు పనికి రానిదానిగాతీసి అవతల పెట్టారుగదా." అంది 'రామా'.

"ఒకమాట చెప్పనా! నీకూ తెలిసేవుంటుందేమోలే."

"వినకుండానే తెలుసునని చెప్పేదెలా?"

'పహాడ్' గ్రామం సంగతి ఇంట్లో నీవుమాత్రం విని వుండవా? ఎన్నో రోజులతర్వాత ఇవ్వాళ మనం కలుసుకున్నాం. లేకపోతే ఎప్పుడో ఈసంగతులు చెప్పుకొని వుండే వాళ్ళం."

'రామా' కొంచెం ముసిముసిగా నవ్వింది. తెలుసుకోవాలన్న ఆదుర్దాతో "ఏంమాటేమిటి అది?" అంది.

"ఏమన్నా వుంటే చెప్పరాదా" అంటూనే సుభద్ర చెంపమీద నెమ్మదిగా ఒకదెబ్బ కొట్టింది రామా.

"భలే! ఐతే నానోటితోనే చెప్పించదలచావన్న మాట" అంది సుభద్ర మూతి విరుచుకుంటూ. రెండో దెబ్బ తగులుతుందేమోనన్న ఆశంకతో వెంటనే "సరే మంచిది. నాకు తెలిసినదేదో చెప్తున్నా. ఆతర్వాత నీమనస్సులో అనుకున్న దేమిటో చెప్పు. సరేనా? అంగీకారమేనా? అంది మళ్ళీ సుభద్ర.

"మొదట నువ్వే చెప్పు."

"నేచెప్పను." అంటూ చేతులతో గట్టిగా ముఖం మూసుకుంది సుభద్ర.

ముఖంమీంది చేతులు తొలగించటాన్కి గట్టిగా ప్రయత్నించింది రామా. కాని సాధ్యంగాకపోయే టప్పటికి నవ్వేసాగింది. మళ్ళీ బతిమాలుకుంటూ "చెప్పవే, చెప్పవే; నీపాదాలకు మొక్కుతా గాని చెప్పవే" అంది.

"ఐతే నా మనస్సులోవున్నది నేనూ చెబుతానని ఒప్పుకోమరి" అంది సుభద్ర.

సరేనని తలవూపింది రామా.

"పహాడీ" గ్రామంలో పన్నాలాల్ అనే అబ్బాయి లేడూ! నిన్ను అతనికివ్వాలని నిర్ణయించుకొన్నారట. నిజం; నిజం; ఏమైనా అబద్ధముంటే అదంతా దేవుడికే తెలియాలి. కాని నేను విన్నదిమాత్రం ఇదే. వరుడు మంచి అందగాడట. అదీగాక ఆపాడు "బజటా' దూరంకూడాలే. ఈ వూళ్ళోవాళ్ళు ధరించే దుస్తులవంటి దుస్తులు ఆ 'బజటా' వాళ్ళుచూచి కూడ వుండరేమో, నేను స్వయంగా చూశానుగా. నిజం, చూస్తే నీకే తెలిసివస్తుందిగా. ఎంతో సంతోషిస్తావు" అంది.

"మరి నువ్వో?"

"నేను నీవమణ్ణి దాంగిలిస్తానా ఏమిటి?"

"ఐతే నేనేనా ఏమిటి ఎవరినైనా దొంగిలించేదాన్ని?"

సుభద్ర ఒకక్షణం ఆగి "అసలు నువ్వెప్పుడైనా చూశావా?" అని అడిగింది.

"చూచి చేసేదిమాత్రమేముంది?" అంది రామా.

"ఏంచేయాలో అదంతా నీమనస్సుకే తెలుసు. కాని చెప్పటం ఇష్టంలేక ఇలా అంటున్నావు. నా మదిలో వున్నదేదో మర్మంవిడిచి స్పష్టంగా చెప్పాను. ఇప్పుడిక నీవంతు. కానదాయకుండా చెప్పు" అంది సుభద్ర.

"నాకేం తెలియదు. నా మనస్సులో ఏమీ లేనూ లేదు." అంది రామా నవ్వుతూ.

"ఏమీలేదా?"

"ఆవగింజంతకూడ లేదు"

"ముమ్మాటికీ ఏమీలేదా?"

దీనికి జవాబేమీ చెప్పక సుభద్ర నొక చెంపపెట్టు పెట్టింది రమా.

"నువ్వీవిధంగా మాటిచ్చి తప్పుతావనుకుంటే నా మనస్సులోవున్నదేదీ బైటపెట్టేదాన్నికాదు." అని గంభీరంగా అంటూ రాతి బండమీదనుంచి లేచి స్నానం చేయటానికి నీళ్ళవొడ్డుకు పోయింది.

రామా సుభద్ర భుజంమీద చెయ్యివేసి క్షీణకంఠంతో సుభద్రా! నా మనస్సేమీ బాగుండటంలేదు. నాకు ప్రత్యేక

మైన కోర్కెలేమీలేవు. రంగురంగుల దుస్తులు, రకరకాల శృంగారాలు నాకెందుకులే." అంది.

సుభద్ర ఇప్పుడూ మౌనంగానేవుంది.

రామా కళ్ళల్లో కన్నీళ్ళు గిర్రున క్రమ్ముకొచ్చాయి. ఎంతో దీనంగా. "నీకు కోపం వచ్చిందా? మా నాన్న, మా అన్నదమ్ముల్ని కాదని, వాళ్ళ అభీష్టానికి వ్యతిరేకంగా ప్రత్యేకమైన కోర్కెలు నాకేం ఉండగలవు? ఎలా వుంచుకో గలను." అంది.

సుభద్ర మౌనం వదలి "పహాడీ గ్రామం అబ్బాయంటే నీకిష్టం లేదా? అని అడిగింది.

"నా యిష్టాయిష్టాలతో నిమిత్తమేలేదు. ఇంట్లోవాళ్లు ఏం నిర్ణయిస్తే అది తప్పక అంగీకరించి తీరవలసిందే."

తర్వాతనే ఇద్దరూ స్నానంచేసి ప్రొద్దుగూకకముందే ఇళ్ళకు చేరుకున్నారు.

# 6

'గంగాదసరా'రోజున వచ్చేపోయేవారందరికీ భోజనాలు పూర్తిఅయిన తర్వాత బట్టలు వేసుకుని తన బాణాకర్రకోసం వెతకసాగాడు.

"ఎక్కడికిరా ప్రయాణంబాబూ?" అన్నాడు తండ్రి 'శిబూ'.

"ఎక్కడికీలేదు, ఏటిదాకా వెళ్ళివస్తా." అన్నాడు దేవసింహుడు.

"ఇంకా ఎండ తగ్గలేదు. వెచ్చగా వడకొడుతోంది."

దేవసింహుడు ఇల్లొదిలి ఎక్కడికీ వెళ్ళలేదు. ఒక మంచంమీద కూర్చొబడ్డాడు. అలాగే ఒక ఘడియకాలం కూర్చున్నాడు; తర్వాత కాస్సేపుపడుకున్నాడు. మళ్ళీలేచాడు; మళ్ళీ పడుకొన్నాడు. ఈరకంగా లేస్తూ, కూర్చుంటూ, పడు కుంటూవున్నాడు ఆవలింతలూ దిట్టంగా వస్తున్నాయి. 'శిబూ' కూడ ఒక మంచానికి చేరబడిభుక్తాయాసం తీర్చుకొంటున్నాడు. తిన్నది అరగటానికి అటూఇటూ దొర్లుతున్నాడు. నిద్రమా త్రంపోవటంలేదు.

దేవసింహుడు గభాలున మంచంమీదనుండి లేచి నిల బడ్డాడు. తన బాణాకర్ర తీసుకొని బయలుదేరాడు. 'శిబూ' చూశాడు, 'అరేయ్' అని పిలుస్తూ "చెప్పితే వినవా ఏమి టిరా? ఇంత ఎండలో బయలుదేరటం దేనికిరా? ఇప్పుడేగా భోంచేసింది. కాస్త ఆగి వెళ్ళగూడదా ఏమిటి?" అన్నాడు.

"చల్లబడవచ్చిందిలే, రోజూ పశువుల దగ్గరకు ఈపాట ప్పుడే వెళ్తుంటాను. ఎక్కడికైనా పోతాయేమో కాస్త చూచివస్తా."

'శిబూ' మారు మాట్లాడలేదు. దేవసింహుడు ఏటి వైపుగా నడచిపోయాడు.

'భద్రాల్'కు తిన్నగా ఏరుదాటి అవతలగట్టున ఉత్త రంగా 'బేతవా' గట్టువెంబడి నడచిపోతున్నాడు దేవసింహుడు. ఎండ మాడిపోతోంది. వెచ్చగా వడగాలి నిప్పులుగ్రక్కు తోంది, గానగచెట్లు, మద్రిచెట్లు ఎండకు పూర్తిగా వాడిపోయి నట్లుగా కన్పడుతున్నాయి. తదితర చిన్నచిన్న చెట్లు అసలు

మాడిపోయినట్లుగా వున్నాయి. అగ్నిమంటలు లేస్తున్నట్టుగా వుంది. కాని 'బుందేల్‌ఖండ్' వాసుల శ్వాసనిశ్వాసలు అసలు వడగాలిగానే వుంటోంటాయి. అందువల్ల ఈ వడగాలి దేవసింహునకేమీ బాధాకరంగా లేదు. చెమటలు కారిపోతున్నాయి. గాలివచ్చి దేహానికి తగులుతుంటే ఎంతో ఎంతో హాయిగా వుంది అటూయిటూ దారితొలగకుండా తిన్నగా ఉత్తరంగా 'బ్రరాల్' వైపునకు నడచిపోతున్నాడు.

సాయంత్రం గాకముందే 'బ్రరాల్' వాగుదగ్గరకు చేరుకున్నాడు దేవసింహుడు దానివడి ఆచ్చటి కొండను కూడ బద్దలుచేసి వేసింది. ఇక వూరక్కడికి షుమారు రెండు మూడు ఫర్లాంగులు ఉండొచ్చు. ఇక ముందుకుపోక అక్కడే వాగు దగ్గర చతికిలపడ్డాడు. అంతా నిర్మానుష్యంగా వుంది. అస్తాద్రికేగుతున్న సూర్యుని కిరణాలు సోకకుండా వెనకప్రక్కన కొండగట్టు అడ్డంగా నిలిచివుంది.

దేవశింహుడు కొన్ని నిమిషాలే కూర్చొని వుంటాడు. ఇంతలో కొండవైపునుంచి రంగురంగుల దుస్తులు ధరించి ఎవరో ఒకమనిషి వస్తూన్నట్టుగా కన్పించింది. ఇటువంటి నిర్జనస్థానానికి ఎవరూ రారని అభిప్రాయపడ్డాడు దేవసింహుడు. కాని ఈ తళుకు బెళుకుల మనిషి కాలిదారివదలి తనవైపుకే రావటం చూచేటప్పటికి దేవసింహునకు భయమూ వేసింది; భ్రమా కల్గింది. గుర్తింపబడతానేమోనన్న భయంతో కాలికి బుద్ధి చెప్పాలని ఆలోచించాడు. కాని ఆ ఆగంతుకుని సోకులు, జాబుసరి దుస్తులు అతన్ని కదలకుండా ఆపుచేశాయి.

అతను పూర్తిగా దగ్గరకొచ్చినపుడు దేవసింహుడు లేచి నిలబడ్డాడు.

ఆ వ్యక్తి దేవసింహుని సామాన్యదుస్తులు చూచి "ఎవరినోయ్ నువ్వు? ఏంపనిమీద కూర్చున్నావు?" అని అడిగాడు.

దీనివల్ల అతను తన్నెరిగినమనిషి కాదనినమ్మకం కల్గింది. అప్పుడు "పశువులు కొన్ని పోయాయి. వాటికోసం వెదకుతూ వెదకుతూ ఇక్కడికొచ్చాను. తమ దేవ్వారండీ? అన్నాడు దేవసింహుడు.

అస్త్రాద్రికేగుతున్న ప్రభాకరునకేసి చూచి "నేనెవరినైతే నీకెందుకు? గాని 'బరాల్' లోని 'బాదల్' చౌదరిగారు భోజనానికి పిలిచారు. అక్కడికే వెళ్తున్నానని చెబితే సరిపోతుందనుకుంటా. అందర్నీ మధ్యాహ్నమే పిలిచారు. నన్ను మాత్రం నాయిబ్బందుల్ని దృష్టిలో పెట్టుకుని రాత్రి భోజనానికి పిలిచారు. ఇంకా కొద్దిగా ఆలస్యముంది. కాస్సేపు నీతోనే బాతాఖానీ వేసుకుని కాలక్షేపం చేస్తా." అంటూ "నీవు కూర్చొని వుండగా ఇటుకేసి ఎవరైనా వచ్చారా?" అని ప్రశ్నించాడు ఆఆగంతుకుడు.

"నేను వచ్చినతర్వాత ఎవ్వరూ రాలేదు.

"ఎంతసేపు అయింది ఇక్కడ కూర్చొని?"

"ఇప్పుడే వచ్చికూర్చున్నా. ఎంతోసేపా? వచ్చాను; మంచినీళ్ళు త్రాగాను అంతే."

"ఎవరు మీరు?"

దేవసింహుడు తనకులం చెప్పాడు.

"ఐతే నీవు మాకులస్థుడవే. 'బగ్రాల్' లో మీ ఇల్లెక్కడ?" అన్నాడు ఆగంతుకవ్యక్తి.

దేవసింహుడు ఆ వూళ్ళో చాలమందిని ఎరుగును. పేర్లూ చాలామందివి చెప్పగలడు. కాని ఆ వూళ్ళో తాను చెప్పిన పేర్లుగల వ్యక్తుల్లో ఆ ఆగంతునకు తెలిసినవాడెవడైనా వుండివుంటే కొంప మునుగుతుందేమోనని భయంగా వుంది. అందువల్ల ప్రసంగం మార్చివేయాలన్న వుద్దేశ్యంతో "మాది అసలు మవ్రా" గ్రామం. 'బగ్రాల్' గ్రామ సర్దార్ 'మాతే' గారి దగ్గర కొద్దిరోజుల క్రితమే గొడ్లకాపరిగా కుదిరాను." అన్నాడు.

"బగ్రాల్" వెళ్ళి చాలరోజులయింది. ఇక 'మవ్రా' వెళ్ళే అవసరం ఇంతవరకేమీ కల్గలా. చాల చిన్నవూరనుకుంటా, పెద్దపెద్ద పట్టణాలు చూశాను. ఢిల్లీ, లాహోరులు కొద్దిరోజుల్లో చూడదలిచాను." అన్నాడు ఆగంతకుడు.

ఈ శుభవార్త దేవసింహునకు కాస్త స్థిమితం కలగచేసింది.

ఆ వ్యక్తి తన తలపాగతీసి ప్రక్కన బండమీద పెట్టాడు. జుట్టుకు పులిమిన సువాసననూనె చుట్టుప్రక్కల వాయుమండలాన్నంతా సువాసనామయం చేసింది.

"తలిదండ్రులున్నారా?"

దేవసింహుని దేహం గగుర్పొడిచింది. తలవాల్చి "లేరు" అన్నాడు.

ఆగంతకుడు తన చిన్నచిన్న మీసాలను చేతితో సవరించుకొని "బగ్రాల్'లో ఏముండిచచ్చింది, అక్కడచేస్తే ఏం

వచ్చి చస్తుందిగాని మాపూరురా, హాయిగా బ్రతుకుతావు. మంచి తిండీ, చక్కటి గుడ్డలు, ఆపైన కావలసిన సౌఖ్యాలన్నీ వున్నాయి. నీ పేరేమిటోయ్?" అన్నాడు.

"నా పేరు 'అవధలాల్' అండీ."

"చాలబాగుంది. పెళ్ళి అయిందా?"

సిగ్గుతో తలవంచుకుని "ఇంకా లేదండీ" అన్నాడు దేవసింహుడు.

"ఐతే ప్రపంచఆనందం నీకేం తెలుసులే?" అంటూ క్రీగంట చూచాడు.

దేవసింహుని పెదవులపై అప్రయత్నంగా చిరునవ్వు చిగుర్చుకొచ్చింది. ఈ షోకిల్లారాయుడి చిక్కురు బొక్కురు ప్రశ్నపరంపరనుండి బ్రతికి బైటపడే వుపాయమేమీ కన్పించటంలేదు. ఇటు అచ్చటనుంచి వెంటనే వెళ్ళిపోవాలనీలేదు. అటు అతనులేచి వెళ్ళిపోయే సూచనగా ఏమీ కన్పించటం లేదు. అతని మాటల్లో ఏదో ఒకటి దేవసింహుని సూక్ష్మ భావాన్ని దేనినో స్పృశించి అతన్ని చలింపచేసింది. షోకిల్లా పురుషుని మాటలు రుచించలేదు. అతని ప్రవర్తన, పద్ధతి అంతా ఆందోళనకరంగాను, అసహ్యకరంగాను ఉంది. ఐనా దేవసింహుని మనస్సు అసహ్యభావంతో తల్లడిల్లలేదు.

ఆగంతునకు పెడముఖంగా, కాని చిరునవ్వుతో, "లేదు" అన్నాడు దేవసింహుడు.

ఆ వ్యక్తినవ్వి "ఓ మిత్రమా! ఎందుకోయ్ ఈ నీతి కబుర్లు? అని ఒక నిముషం ఆగాడు. తర్వాతమళ్ళీ కళ్ళుఇంతింత చేసి గర్వంగా ప్రపంచంలో అలాంటివాడసలు లేడేలేడనుకో.

వయస్సులో నీకంటే ఎక్కువ పెద్దవాణ్ణిగాకపోయినా, అనుభవంలో మాత్రం పెద్దవాడినే. మనస్సులోపలకుదూరి అడుగున ఏమున్నదో తడిమి తెలుసుకోగలను. ఎగురుతున్న పక్షినిచూచి అదేమిపక్షో చెప్పగలను. ఈచిన్న వయస్సులోనే ఎంతమంది మగవాళ్ళను, ఎంతమంది ఆడవాళ్ళను పరీక్షించి చూశానో లెక్కలేదు.'' అన్నాడు.

''కావచ్చునండీ. నేనేదో నౌకరుపని చేసుకునే మనిషిని ఇలాంటి విషయాలు నాకేం తెలుసులెండి!'' అన్నాడు దేవసింహుడు కొంచెం గంభీరభావంతో.

పకపకా నవ్వి ''అహాహా! అహాహా!! నౌకర్లకసలు భగవంతుడు మనస్సులనేవి పాపం ఇస్తేగా. మా ఊరొచ్చి నౌకరుగావున్నతర్వాత ఈవిధంగా మాట్లాడినపుడు చూస్తా. కాని ఇప్పటికీ విషయమే వేరులే. సరే, మిత్రుడా! మేము మాత్రం 'పక్షులు' అంటేపడిచస్తాం. రంగురంగుల పక్షులంటే సర్దాగా వుండనివారెవ్వరుంటారు?'' అన్నాడు.

కేవలం చర్చ కొనసాగిపోవాలన్న భావంతో ''తమరు చెప్పేది నిజం.'' అన్నాడు దేవసింహుడు.

''ఇక్కడ ఈ 'బరాల్' వూరిపక్షీ కూడా ఒకటి, చాల పేరుగన్న పక్షిలే, నా పంజరంలోకి ఎగిరి రానున్నది.''

దేవసింహుడు కొంచెం చిరుక్కుమన్నాడు. కొంచెం కుతూహలంతో, అణగి ఉన్న ఆదుర్దాతో ''నేనైతే అక్కడ ఎవర్నీ ఎరుగను. గాని, ఆ పక్షి ఎవరండీ?'' అని అడిగాడు.

ఏదో సామాన్య సరుకు అయితే ఈ పన్నాలాల్ చెయ్యిచాచేమనిషికాదు. ఇతను అన్నిటికన్న పెద్ద, అన్నిటి

కన్న మంచిసరుకుతప్ప ఇంకొకటి బుట్టలో వేసుకోడనుకో॥" అన్నాడు పన్నాలాల్ తలవ్రూపి.

నోరు విప్పక ఆశ్చర్యంగా ప్రశ్న సూచకభావంతో సగర్వంగా తన్ను పన్నాలాల్ అని చెప్పుకున్న వ్యక్తికేసి చూడసాగాడు దేవసింహుడు.

"ఇంకేవిషయాలన్నా అయితే చెప్పవచ్చును. కానిఇది మాత్రం విపులంగా చెప్పదగినదికాదు." అన్నాడు పన్నాలాల్.

మరల దర్జాగా తలపాగ నెత్తిన పెట్టుకుని 'బజార్' వైపుకు ఠీవిగా నడుస్తూ "నౌకరీ కావాలనుకున్నప్పుడు 'పహాడీ' లో మాయింటికిరా. ఇక్కడకు ఆగ్నేయమూలగా మైలుదూరంలో వుంది. అదిగో ఇక్కడనుంచి చూస్తే ఆఖర్జూరపుచెట్లు కన్పడుతున్నాయ్, మావూరు ప్రక్కగావచ్చిన దారియే అటుగుండా పోయింది. నేనేదో షికార్లు కొడ్తూ ఇటు చుట్టుతిరిగి వచ్చాను." అన్నాడు.

మళ్ళీ క్రీగంట చూస్తూ చిరునవ్వుతో "బాదల్ చౌధరి ఇంట్లో నేను గొప్పవిందు. మళ్ళీ ఎప్పుడైనా కలుసుకో. అప్పుడు ఆలోచిద్దాంలే." అన్నాడు.

# 7

పన్నాలాల్ అన్న చివరిమాట రహస్యమయంగా వుంది. స్పష్టంగా తేల్చి ఏమీ చెప్పలేదు. కాని ఎంతవరకు చెప్పాడో, ఏవిషయం సాంకేతికంగా చెప్పాడో, దానివల్ల దేవసింహుని కాళ్ళూ చేతులు చల్లబడ్డాయి. ప్రొద్దు ఇక కొద్దిగా వుంది. రాత్రికి మళ్ళీ ఇంటికి తిరిగి వెళ్ళాలన్న నిశ్చ

యంతో వచ్చాడు. తిరిగి వెళ్ళుటకు మనస్కరించలేదు 'రామా' ను చూడటమైతే చూశాడు. కాని ఆవిడ కంఠ స్వరం మాత్రం ఎన్నడూ వినలేదు. ఒకసారి దూరాన్నుంచి రహస్యంగా మాటలు వినాలని బుద్ధిగా వుంది. దానికి తోడు పునర్వివాహం నిజమా వట్టిదా అని ఒక చింత మనస్సును దహించి వేస్తోంది. ఒకవేళ జరగనుంటే ఎవరితో జరగనున్నది? ఇందులో 'రామా' అభిప్రాయమేమిటి?

ఈ ప్రశ్నలన్నిటికీ సమాధానం పొందాలనే వుద్దేశ్యం తోనే అసలు వచ్చాడు. కాని అతనికి కలిసిన మనిషిద్వారా వీటన్నిటికీ తగినసమాధానాలు లభించలేదు సరిగదా, పైపెచ్చు అనేక సందేహాలు వచ్చి చుట్టుముట్టాయి. కలుగుతున్న బాధకు అంతులేదు

ఈరకమైన రంగురంగుల దుస్తులతో పన్నాలాల్ రావ టానికి కారణమేమిటి? ఈ నాటకమంతా ఏమిటి ? ఎందుకు ? కన్నుగీటుతూ ఎందుకు చూచేవాడు? పెద్దపెద్ద సరుకు మినహా ఇంకా దేనికీ ఆశించనని సగర్వంగా చెప్పాడే! ఐతే ఈవ్యాళ్ళో అన్నిటికన్న పెద్దసరుకు – కుటుంబం – ఏదైవుండగలదు ?

రామాతండ్రి కుమార్తెకు పునర్వివాహం చేయటానికి నిశ్చయించుకున్నాడు. బహుశా పన్నాలాలే ఆ శాబోయే వరుడుకావచ్చు. అరరే! ఇక్కడనే వాడి గొంతు ఎందుకు పిసికిపారవేసిన వాణ్ణిగాదు "ఇంతలో చాటునుండి చూస్తే ఎవరో ఇద్దరు కన్యలు వాగువైపుకు వస్తున్నట్లు కన్పించారు. లేచి వెళ్ళిపోవాలనుకున్నాడు. కాని ఎవరు బలవంతంగా కాళ్ళు పట్టుకుని వెనక్కులాగారో తెలియదుగాని, మొత్తంమీద

అక్కడనుంచి పూర్తిగా వెళ్ళిపోలేదు; కొద్దిగా అవతలకు తొలగి ప్రక్కనేవున్న రాతిబండచాటున పొదిగి కూర్చున్నాడు. వాళ్ళు అక్కడనుండి వెళ్ళిపోయిన తర్వాత తానూ వెళ్ళిపోవటమో లేక పూళ్ళోకెళ్ళి భోగట్టా ఏదైనా తెలుసుకోవటమో నిర్ణయించుకుందామనుకున్నాడు. ఇంత ఆలస్యానికి కారణమేమిటని ఒకవేళ 'శిబూ' అడిగితే గొడ్లు పోయాయని వాటిని వెదకుతూ వెదకుతూ అడవి అంతా తిరిగొచ్చానని చెప్పాలనుకున్నాడు.

ఆ కన్యలిద్దరూ దరిదాపులోకి వచ్చారు. రాతిబండ చాటుగా ఒకసారి తొంగిచూడాలని కోరిక కలిగింది. కాని దాన్ని అణచుకున్నాడు. కంటబడితే ఏమంటారో? అని ఆలోచించాడు.

ఒక అమ్మాయి ఇంకో అమ్మాయితో "ఇదిగో ఇక ఇప్పుడైనా చెప్పు. ఇక్కడెవ్వరూ లేరుగా, లోలోపల సంతోషం పట్టలేక ఉబ్బిపోతూండవచ్చు. ఏం?" అంది.

"నవ్వు పొన్లుకొచ్చింది; ఎంతో కష్టంమీద ఆపుకున్నా" అంది రెండో అమ్మాయి.

"ఎటువంటి విక్రమశూరుడో, ఎటువంటి వక్రుడో చూచావుగదూ! చూడటంతోనే నీ మనస్సు ఉరుకులు, పరుగులు తీస్తుందని నేను మొదటనే చెప్పలేదా?"

నీ మొఖమూ, నీబొందానూ. ఆ బట్టలు చూడు, ఆడదాని బట్టల్లాగున్నాయి. ఇక పరికిణీ ఒక్కటే తక్కువ." అని నవ్వింది రెండో అమ్మాయి.

ఈ మధురకంఠం దేవసింహుని వీనులకెంతో ఇంపుగా ఉంది. సంభాషణల మధ్యమధ్యన వెలువడే పరిహాసవాక్కులు వెండి పళ్ళెంలో వర్ష బిందువులు పడినట్లుగా కన్పడేవి.

వాళ్ళింటికి వెళ్ళి మళ్ళీ "ఆడవాళ్ళలాంటి జట్లు" అంటే అప్పుడోప్పుకోంటూ" అంది మళ్ళీ మొదటిఅమ్మాయి.

"చాలుచాల్లే. ఈమాటలానాకు చెప్పేది? ఇదంతా ఎందుకు? బ్రహ్మలిఖితమెలావుంటే అలా జరిగితీరుతుందిగాని, యిప్పటినుంచే వాగకు." అంది రెండో అమ్మాయి గంభీర భావంతో.

ఇప్పుడిక దేవసింహునకు తన కోర్కెను అణచిపెట్టి వుంచటం చేతకాలేదు. ఒక ప్రక్కకు వారిగి యిద్దర్నీ ఒకసారి చూశాడు. గుర్తించటానికి ఎంతోకాలం పట్టలేదు.

ఆ సొగసైన దేహము గుండ్రనికాని కొంచెం పొడు గాటిముఖం. బంగారుఛాయ. మూసలోపోసి తయారుచేసి నదా అన్నతల; ఎత్తైన నుదురు; తామరపుష్పాలనంటి చేతులు; తిన్నటిముక్కు; ఎర్రటి సన్నని పెదవులు; గడ్డంమధ్యలో పల్లం చక్కటి పెద్దపెద్ద కళ్ళు; పొడుగాటి కనురెప్పలు; ధనస్సులాంటి కనుబొమ్మలు - అన్నీ అవే. గొంతుమాత్రమే యింతవరకు వినివుండలేదు, ఆ కొరతా యివ్వాళ తీరింది. వివాహ సంద ర్భంలో చాలాసార్లు చూశాడు. అదికూడ కొద్ది నిమిషాలు, సంకోచంగా స్మృతిఫలకంమీద ఆ 'బొమ్మ' రేఖలు చాల దట్టంగా ముద్రించబడ్డాయి. వివాహమైనతర్వాత ఒక రహస్య మయ ప్రేమరంగుతో కల్పన దానిఅవయవాలన్నీ చక్కగా దిద్దింది.

ఒకనిమిషంపాటు రాతిబండకొనక్రింద తల కనపడ కుండా దాచుకున్నాడు. కాని దానిక్రిందనుంచి మళ్ళీ పైకి తీయటం అసంభవంలా అయింది.

మొదటి అమ్మాయిని లోగడ చూశాడో లేదోగాని మొత్తంమీద గుర్తుపట్టలేక పోయాడు. తదేకదృష్టితో రెండో అమ్మాయి – రామా – కేసి చూడసాగాడు.

"సుభద్రా! నీ తలిదండ్రులు నీ అత్తవారింటికి పంపక మరొకరి యింటికి పంపుతామని చెబితే నీకెలాగుంటుందే? అని అడిగింది రామా.

"మా కులంలో అలాంటి ఆచారమేలేదుగా" అంది సుభద్ర కొంచెం తీవ్రంగా.

"ఐతే, నేమేనా ఏమిటి అంత తీసేసింది? సరే, ఆగొడవలు యిప్పుడెందుకులే. తరుణం వచ్చినపుడే ఆలోచిద్దాం. యిప్పటినుంచే కృశించి ప్రాణాలర్పించటం దేనికి?" అంది రామా.

"ఔనులే, తరుణం వచ్చినపుడు పైకి ఏడుస్తూ, లోపల సంతోషం పట్టలేక ఉబ్బితబ్బిబ్బవుతూ 'బరాత్' నుంచి వెళ్ళిపోతావు." అంది సుభద్ర.

సుభద్రను కొట్టాలని చెయ్యి ఎత్తింది రామా. దెబ్బ కాచుకోటానికి చెయ్యి ఎత్తింది సుభద్ర. రామా కొంచెం సేపు ఎత్తినచెయ్యి అలాగే వుంచింది. బంగారానికి మించిన కాంతి గల ఆ చేతికి తాము పెట్టిన ఆభూషణాలు గుర్తుపట్టాడు దేవసింహుడు. వ్రేలి వుంగరం సయితం గుర్తించగలిగాడు.

బండచాటునుంచి ఇవతలకు వచ్చి ఆ చేతిని ముద్దు పెట్టుకోవాలనిపించింది. కాని సాహసించలేకపోయాడు.

ఇంతలో ఆ వెనకటి రంగురంగుల దుస్తుల పన్నాలాల్ తిరిగి వాగువద్దకు వస్తున్నట్లు కన్పడ్డాడు. ఆ అమ్మాయిలిద్దరూ భయంతో ఒకరినొకరు చూచుకోసాగారు. దేవసింహుడు తనతల వెనక్కి తీసుకొని బండచాటున పెట్టుకున్నాడు.

"ఇంతకు ముందు ఇక్కడే కూర్చొనిపోయాను. ఆబండమీద చేతి రుమాలు వదలిపెట్టాను. గాలికి ఏమన్నా కొట్టుకుపోయిందేమో చూశారా?" అన్నాడు నవ్వుతూ పన్నాలాల్.

సుభద్ర రామాచేతిని నొక్కింది. కోపంతో, కాని నెమ్మదిగా, "భలే, ఇదేమిటమ్మా?" అంది రామా.

పన్నాలాల్ ఇంకా కాస్త దగ్గరకొచ్చాడు. ఒక రాతి బండమీద కాలుపెట్టి "మీావూరికి మంచి అచారాలే వున్నాయి. పరాయివాళ్ళ వస్తువులు దొంగిలించి మళ్ళీ తిరిగి ఇవ్వటం తెలియదనుకుంటానే." అన్నాడు.

"ఏం దొంగిలించామేమిటి?" అంది మెల్లగా సుభద్ర అతనికేసి చూడకుండానే.

"ఏదో ఒకటి దొంగిలించనే దొంగిలించారు. అందుకేగా మళ్ళీ తిరిగివచ్చింది." అంటూ మళ్ళీ నవ్వుతూ "కాస్త వారినికూడ అడిగి తెలుసుకోండి రుమాలు గనక చూచివుంటే కాస్త చెప్పమనండి" అన్నాడు పన్నాలాల్.

రామాకు చెమట్లు క్రమ్ముకొచ్చాయి

"మేం మీా రు మాటలూ చూడలేదు; గిమాలూ చూడ లేదు. మీాతో ఇంకెవ్వరైనా కూర్చొనివుంటే వెళ్ళి అతన్ని అడగండి" అంది సుభద్ర.

కాలు మోపి నిల్చొనివున్న బండకు చల్లగా చేర బడ్డాడు పన్నాలాల్. సంభాషణలు పొడిగించాలన్న వుద్దేశ్యంతో "ఎవడో ఒక పల్లెటూరి గొడ్లకాడమనిషి ఇక్కడ కూర్చొనివుండగా లేచి వెళ్ళాను. వాడేమన్నా తీసుకుపోయా డేమో, మీాకు వాడు కనపడివుండొచ్చు" అన్నాడు.

"మా కెవ్వరూ కన్పించలేదు" అంది సుభద్ర.

"అన్నిటికీ నువ్వేనా సమాధానం చెప్పేది? లేక అమ్మాయి తరఫుననుంచికూడ ఏమైనా వస్తుందా? అసలా అమ్మాయి మాట్లాడనే మాట్లాడదేమిటి?" అన్నాడు నవ్వుతూ పన్నాలాల్.

కొంత కాఠిన్యంతో కూడిన చిరునవ్వుతో సుభద్ర భుజంవూపి "ఎందుకు మాట్లాడాలేమిటి? ఐతే పెద్దగా అరవ మంటావా? నీవంటి సిగ్గులేనితనం ఎక్కడనుంచి తెచ్చుకోను?" అంది రామా.

"ఉహు; 'పహాడీ' వూరిమనిషి అని తెలుసా తెలి యదా?" అంది కోపంగా సుభద్ర.

"'కాబోలు' ఎక్కడికొచ్చావో అక్కడికి వెళ్ళు. ఈ అనవసర ప్రసంగమంతా దేనికి? ఎవరైనా చూస్తే ఏమనుకుం టారు?" అంది రామా ముఖం త్రిప్పి చూడకుండానే విసు క్కుంటూ.

" ఈ కాఠిన్యవైఖరిచూచి పన్నాలాల్ ఒక రెప్పపాటు కాలం సంభ్రమాశ్చర్యాలతో అలాగే నిలబడిపోయాడు. కాని అతని మొండితనం అంత తేలిగ్గా పోయేది కాదు.

"అంత అనరాని మాటలు నేనేం అన్నాను? ఎవడైనా వచ్చి వింటే ఏమంటాడు? మనమేమీ అలౌకికమాటలేమీ మాట్లాడుకోవటంలేదే." అన్నాడు పన్నాలాల్.

అతను సుభద్రకేసి చూపులునిగిడ్చి చూశాడు. ఆ చూపులు చూచి భయపడింది సుభద్ర. ఆ తర్వాత మళ్ళీ పన్నాలాల్ వైపుకు కన్నెత్తి చూడలేదు. "మేం స్నానం చేయాలి మీరింకా యిక్కడ ఎంతసేపు కూర్చుంటారేమి!" అంది.

పన్నాలాల్ రవ్వంతకూడ అటూయిటూ కదలాలేదు మెదలాలేదు. మరల ఆ చిరునవ్వుతోనే "రుమాలు వెదుక్కొని యిప్పుడే వెళ్ళిపోతాను. కాని యీవిడ నోటినుండి కూడ ఒకమాటంటే ఒకమాట వినాలనివుంది.!" అన్నాడు.

"ఈమెవెవ్వరో తెలుసా? బాదల్‌చౌధరి గారికుమార్తె." అంది సుభద్ర.

పన్నాలాల్ వెంటనే లేచి నిల్చున్నాడు. "క్షమించండి; వాగే అలవాటు నాకేమీలేదు. రుమాలు నిజంగానే పోయింది. వెదక్కొని యిప్పుడే వెళ్ళిపోతా, చీకటి పడ వస్తోంది. మీరుకూడ త్వరగాస్నానంచేసి యిళ్ళకు పొండి. నేనూ అక్కడికే పోతున్నా, ప్రక్కన అడవివుంది. అడవిజంతువులు బైటికొచ్చే వేళ అయింది. ఒకసారి తనివితీర ఇచ్చట

చూడలేకపోయినా ఎక్కడో ఒకచోట తప్పక చూస్తానులే." అన్నాడు.

రామా వెనక్కి తిరిగి నిలబడివుంది. పన్నాలాల్ రుమాలు వెదకినట్టుగా నటిస్తున్నాడు. అటు మెల్లనిచూపులతో ఆవిడ అందచందాలు పరిశీలించటానికి ప్రయత్నిస్తున్నాడు. రుమాలు కోసం వెదకుతూ వెదకుతూ నెమ్మదిగా దేవసింహుడున్న బండ దగ్గిరకొచ్చాడు.

దేవసింహునకు వూపిరాడటంలేదు. ఉక్కిరి బిక్కిరైపోతున్నాడు. భూమి బ్రద్దలైతే అందులో ప్రవేశించాలనిపిస్తోంది. కాని పెద్దగా ఆలోచించాల్సిన అవసరం కల్గలా. ఎందుకంటే అతన్ని చూడగానే పన్నాలాల్ వులికిపాటుతో ఒక అడుగు వెనక్కితగ్గాడు. వణకుతూ "ఎవరు?" అన్నాడు.

దాగటం అంతచెడు మరొకటిలేదని తలచాడు దేవసింహుడు. నెమ్మదిగాలేచి నిల్చొన్నాడు, రొమ్ముకు రెండు చేతులూ గట్టిగాచేర్చి బొంగురు గొంతుతో "ఏమిటి?" అన్నాడు పెద్దగా.

ఆకస్మిక సంఘటన కారణాన పన్నాలాల్ కళ్ళు చిరతలారాయి. అందుచేత దేవసింహుని వెంటనే గుర్తించలేకపోయాడు. రామా సుభద్రల నేత్రాలూ అటుకేసి మరలాయి. సుభద్ర అతన్ని పెండ్లికొడుకు వేషంలో – తలమీద మకుటం ఆకర్షణీయ దుస్తుల్లో – చూచింది. అందుచేత ఇప్పుడు వెంటనే గుర్తుపట్టలేకపోయింది. దొంగ అనుకుని రామాను చాటు చేసుకొని నిలబడింది. ఇక రామా సంగతి. ఆవిడ అగ్ని – ప్రదక్షిణం చేసేటప్పుడు దేవసింహుని చూచింది.

ఆ తర్వాతకూడ చాటుగా ఆపెళ్ళి రెండు రోజుల్లోపల అనేక సార్లు చూచింది' ఆ ఆకృతిని మరచిపోవటం అంత తేలికకాదు. కాని ఆశ్చర్యమేమంటే 'బజటా' నుండి ఏవిధంగా వచ్చాడు, ఎందుకొచ్చాడు? ఈఆశ్చర్యం కారణంగానే ఒకటి ఒకటిన్నర నిమిషాలవరకు నిజంగాఅతను దేవసింహుడు ఔనోకాదో యని సందేహం కలిగింది. కాని సరిగ్గా చూచినకొద్దీ సందేహ మాయమైపోసాగింది. ఎలావచ్చినా, ఎందుకొచ్చినా సరే, కాని మొత్తంమీద నిజంగా ఆయనే రామా దేవసింహుని కేసిచూస్తూ ఎత్తిన రెప్పను క్రిందికి వాల్చలేదు.

పన్నాలాల్‌కూడ తన పూర్వ పరిచితుని రెండు నిమిషాల్లోనే గుర్తు పట్టగలిగాడు. దాంతో గుండెదడ, తగ్గిపోయిన ధైర్యం మళ్ళీవచ్చింది.

ఠీవిగా నిలబడి "ఏమోయ్? నీవు 'భర్రోల్' నుంచి గొడ్లను వెదకే పనిమీద వచ్చావా లేక ఇంకేమన్నా దొంగ తనం పనిమీద వచ్చావా?" అన్నాడు పన్నాలాల్.

పన్నాలాల్ ఆఅమ్మాయిలతో అన్నమాటలు అతని చెవుల్లో ఇప్పటికీ గింగురుమంటూనే వున్నాయి. కాని అతను తన్ను వెల్లడించదలచలేదు.

"దొంగతనం మాకేం వృత్తికాదు. అలాంటి పనులు మాకేం చేతకాదు. గేదెలుకోసం వచ్చాను, దొరికితే వెంటనే వెళ్ళిపోతా. లేకపోతే దొరికేవరకు ఇలాగే తిరుగు తోంటాను. మీపనియేమిటో మీరు చూచుకోండి. నాజోలి మీకెందుకు?" అన్నాడు దేవసింహుడు.

సుభద్ర వణికిపోతోంది. రామా సుభద్ర చెవిలో "భయపడకు. నే ప్రక్కనే వున్నాగా. ఇంటికిప్పుడే వెళ్ళి పోందాం." అంది.

"పోదాంపద" అంది సుభద్ర భయంతో.

పన్నాలాల్ క్షుబ్ధుడై అచ్చంగా "పరగ్రామం జమీం దారుబిడ్డలా మాట్లాడుతున్నావే. పోరా ఇక్కడనుంచి లేక పోతే తొంటిపూస నుగ్గునుగ్గు చేయిస్తా." అన్నాడు.

దేవసింహుని భుజాలు ఉబ్బుకొచ్చాయి. చెయ్యి బాణాకర్రమీదికి పోయింది. గొడవ జరుగుతుందేమో నన్న ఆశంక రామాచేత గొంతు విప్పించింది. ఒకసారి సుభద్రకేసి మరొకసారి సంకోచపూర్ణ దృష్టితో దేవసింహునకేసి చూస్తూ కంపిత, మృదుకంఠంలో దెబ్బలాటలు వద్దు. ఇంటికి వెళ్ళండి. ప్రొద్దుగూకిపోయింది. మంచిదారి కాదు. ఊరు దగ్గరలోనే వుంది. మీ గేదెలు ఎక్కడవుంటే అక్కడ వెదకి తోలుకు పోండి. ఇచ్చట అనవసరంగా తగాదాలు పెంచుకోవటంవల్ల ప్రయోజనమేమిటి? పోదాం పదవే, సుభద్రా! ఇంటికి" అంది రామా.

దేవసింహుడు ఆవిడకేసి తదేకదృష్టితో చూశాడు. రామా నేత్రాలు ప్రేమ సరస్సుతో నిండివున్నట్లుగా కన్పించాయి. ఒకక్షణం దేవసింహునకేసి తేరిపారచూచి తలవాల్చింది రామా. ఎంత అనునయం! ఎంతవినయం! కొన్ని నిమిషాల పూర్వం పన్నాలాల్‌తోకూడ కొద్ది గొప్పగా మాట్లాడింది. కాని ఆశబ్దాలలో కటుత్వం లేకపోయినా వాటిలో అదోరక

మైన భయంకనృడింది. మరి యిప్పుడు? ఈ రెంటినీ పోల్చి చూడుకుంటే దేవసింహునకెంతో ఆశ్చర్యంకల్గింది.

వచ్చిన ఆదేశం శిరసావహించటం తన కర్తవ్యంగా భావించి 'భరౌలీ' వైపుకు నడవసాగాడు దేవసింహుడు.

"పద పోదాం. వెళ్ళి నదిలో స్నానం చేసి పోదాం." అంది సుభద్ర.

ఊరుకు ఆనుకొనివున్న ఏటిరేవుకు బయలుదేరారు. వారికి ఒకటి రెండు అడుగులు ముందున్నాడు పన్నాలాల్.

దేవసింహుడు కొన్ని అడుగులుమాత్రమే నడచి వెనక్కి తిరిగి చూశాడు. సరిగ్గా అదేసమయంలో రామాకూడ వెనక్కి తిరిగిచూచింది. దేవసింహుడు తనకేసిచూస్తూ వుండటం గమనించి తన దృష్టిని మరల్చుకుంది. దేవసింహుడు వాగు గట్టెక్కాడు. కనుచూపు మేరవరకు రామాను చూస్తూ నిల్చొన్నాడు.

వాగు అవతలివొడ్డునుంచి ముందు కెళ్ళటానికి దేవసింహునకు కాళ్ళు ముందుకు పడటంలేదు. సంతోషం, విచారం, ఈర్ష్య, వేదన మొదలైన పరస్పర వ్యతిరేకభావాల మధ్య చిక్కుకొని కొట్టుకులాడుతున్నాడు. ఆలోచిస్తూ ఆలోచిస్తూ పన్నాలాల్ ఆకస్మికంగా రావటం విషయం వచ్చేవరకు ఆలోచనలన్నీ ఆగిపోతున్నాయి. ఏదైనా మరో ఆలోచన వచ్చి చాంచల్యం సుడిలోవేసి గిరగిర త్రిప్పితే అది పన్నాలాల్ సుభద్రల సంభాషణతప్ప మరొకటికాదు.

కాస్త మనస్సుకు శాంతి కలిగినమీదట గ్రామంలోకి వెళ్ళటానికి నిశ్చయించుకొన్నాడు. తండ్రి జ్ఞాపకమొస్తే

గొడ్లు తప్పించుకు పోయాయనీ, వాటిని వెదకటంకోసం వెళ్ళానని చెప్పాలనుకున్నాడు.

చీకటిపడింది, ఊరువైపుకు రాసాగాడు. కాని ఇంతకు ముందొకసారి ఆశ్రయం తీసుకున్న రావిచెట్టు క్రిందకు రాగానే ఆగిపోయాడు.

'మళ్ళీపెళ్ళి' సంగతి నిజమో అబద్ధమో గట్టిగా తెలుసుకునేవరకు ఇంటికి వెళ్ళకూడదనుకున్నాడు. తర్వాత ఏమి జరిగినాసరే' రావిచెట్టు నీడన ఈవిధంగా గట్టినిర్ణయం చేసుకున్నాడు దేవసింహుడు,

ఊరు ఇంకా మాటుమణగలేదు. కాస్త సందడి తగ్గి, అంతా నిద్రించిన తర్వాత వూళ్ళోకెళ్ళాలని ఆలోచించాడు.

కాని వూరంతా పూర్తిగా మాటుమణగిన తర్వాత ఇంకా మాట్లాడే దెవరితో? ఎవరుకన్పడుతారు? ఎవరి నడిగి తెలుసుకోవాలి? ఐనా ఇవ్వాళ తప్పనిసరిగా భోగట్టాయంతా తెలుసుకుపోవాలి. ఏశక్తియో తెలియదుగాని, లోపలనుంచి ముందుకెళ్ళమని ప్రోత్సహిస్తోంది. కాని కాళ్ళూ చేతులు ఆడటంలేదు. ఆలోచనా ప్రత్యాలోచనల్లో కాస్త ఆలస్యమైంది.

ఇంతలో ఇద్దరు స్త్రీలు హారతులు వెలిగించుకుని పళ్ళేరముల్లో పెట్టుకుని రావిచెట్టు వైపుకు వస్తున్నట్లు కన్పించారు. ఇద్దరూ హారతులు ఆరిపోకుండా పమిటకొంగులు చాటుచేసుకుని నడచి వస్తున్నారు.

దగ్గర కొచ్చినమీదట వారిద్దర్నీ గుర్తుపట్టాడు దేవసింహుడు. రావిచెట్టు క్రింది అరుగుమీది దేవుళ్ళకు దీపాలు పెట్టి పోవాలని వచ్చారని గ్రహించాడు. కొద్దిగా వెనక్కి తగ్గి

నిల్చొన్నాడు. కాని వారు కనపడకుండా వుండేటంత దూరం మాత్రం వెనక్కి పోలేదు. వారిద్దరూ 'రామా సుభద్రలు'.

దీపాలు అక్కడవుంచి ఇద్దరూ దేవుళ్ళకు నమస్కరించారు. తర్వాత రామా బయలుదేరబోయింది. కాని సుభద్ర వారించి "నిజం తెలుసుకునేవరకు నాకు నిద్రపట్టదు." అంది.

"చీకటి పడవచ్చింది; దారి మంచిది కాదు; మరి ఇంకేమేవో అన్నావు. అవన్నీ అప్పుడెందుకన్నావు? ఆమనిషి ఎవరు? నీకునావొట్టు, నిజంచెప్పు. 'బజటా' బావగారా ఏంటి?"

పట్టుకున్నదాన్ని వదలిపెట్టవు. వట్టి మొండిదానివి. సరిగ్గా గుర్తుపట్టలేకపోయానని చెప్పుతున్నా. అందులో అబద్ధమేమీ లేదు." అంది రామా అప్రసన్నతతో.

"ఐతే దీపాలు వెలిగించిపోటానికి యివ్వాళ నన్ను కూడ ఎందుకు వెంటబెట్టుకొచ్చావు?"

"భయపడ్డాను. ఖర్మంచాలక ఆ 'పహాడీ' లాంటివాడెవ్వడైనా ఎదురొతాడేమోనని జడిసా."

"బజటా, మనిషి కలిసినా యిలాగే భయపడతావా? బహుళ అప్పుడు వరుగవరుగున పోయి దగ్గిరికెళ్ళి చేర్తావనుకుంటా."

"ఎప్పుడు చూచినా నీకు వేళాకోళంతప్ప యింకోకటి స్ఫురించదనుకుంటా."

"నన్నెందుకు వెంటబెట్టుకొచ్చావో తెలుసులే. ఎవరైనా అడిగితే సాక్ష్యానికి పనికివస్తానని తీసుకొచ్చావు. జోర! ఎంతటి జాణవంటేనూ?"

"ఒకందుకు వెంటతీసుకొచ్చాను. ఆ వ్యవహారంలో ఒంటరిగా రావటాన్కి భయమేస్తుంది. చిన్న అమ్మవారి. రాయి ఒకటి ఏదో ఒక ప్రతినకొరకు రావిచెట్టు తొర్రలో పెట్టాలనుకున్నా. అది నెరవేరితే నీకు బంగారపు నగలు చేయిస్తా" అంది రామా.

తర్వాత ఒకరాయి తీసింది; అరుగెక్కి ఎత్తుగా చెట్టు తొర్రెలో పెట్టింది.

సుభద్ర వద్దని వారించుతూనేవుంది. ఐనా పెట్టేసింది. "ఏమిటిది? ఎందుకు చేశావు?" అంది సుభద్ర.

"ఎప్పుడైనా మళ్ళీచెబుతాలే." అంది రామా.

ఇంతలో గాలివిసురొచ్చి దీపాలు రెండూ కొండెక్కాయి. యిద్దరూ యింటికి వెళ్ళిపోయారు. కొన్నినిమిషాల అనంతరం దేవసింహుడూ ఒక రాయితీసి దానిజతను తొర్రలో పెట్టాడు.

# 9

చీకటి పడినతర్వాత భోజనానికి 'బాదల్' గారింటికి చేరుకున్నాడు పన్నాలాల్. రంగురంగుల, తళుకుబెళుకు దుస్తులు ధరించే ముఖాల్లో ఎంత తేజస్సు వుంటుందని ప్రజలు ఆశిస్తారో అంత తేజస్సు పన్నాలాల్ ముఖంలో లేదు. ముఖం క్లాంతంగావుంది. కాని అవసరం కల్గినపుడల్లా నవ్వు తెచ్చుకునే అలవాటుమాత్రం బాగా వుంది. కళ్ళల్లో కాంతి లేకపోయినా పెదవులమీాది నవ్వుతోనే సరి, నవ్వుకుంటూ 'బాదల్' చౌధరికి నమస్కారం చేశాడు.

అతను స్వాగతమిస్తూ "చాల ఆలస్యం చేశారేంటి? తిరిగి వెళ్ళటానికి ప్రొద్దుపోతుందేమో?" అని అడిగాడు కొంచెం విస్మయంతో.

"అంత పెద్ద ప్రొద్దుపోతే ఇవ్వాళ ఇక్కడే పడుకుంటాను లెండి." అన్నాడు నిస్సంకోచంగా పన్నాలాల్. "పరాయి ఇల్లుకాదుగా." అనటంతోనే ఏదో ఒక అజ్ఞాతభావం వచ్చి అతి త్వరలో జరుగనున్న సరికొత్త సంఘటన గుర్తుకొచ్చి ఆనందమయ అనుభవాభిలాషలతో హృదయం పులుకరించింది.

'బాదల్' భోజనపుటేర్పాట్లు చేస్తూ "అసలు 'పహాడీ' మాత్రం ఎంతదూరం వున్నదిలెండి. మీవూరి ఖర్జూర చెట్లు ఇక్కడికి స్పష్టంగా కన్పడుతుంటాయి." అన్నాడు.

దీనివల్ల పన్నాలాల్‌కు వుత్సాహమూ కల్గలేదు; నిరాశా కలగలేదు.

"ఇంకా భోంచేయాలి. తర్వాత మాట్లాడాలి. ఇదంతా అయ్యేటప్పటికి బాగా ప్రొద్దుపోతే పోవచ్చు. అంతగాపోయినా పర్వాలేదు." అన్నాడు పన్నాలాల్.

"ఔనులెండి; వెన్నెలేగా?" అన్నాడు 'బాదల్'.

ఈ మాటలో దారి ఇబ్బందేమీ లేదన్న సంకేతం ఇమిడి వున్నదన్నమాట.

"బజటావాళ్ళనుంచి వుత్తరాలేమైనా వచ్చాయా?" అని అడిగాడు పన్నాలాల్ ప్రసంగం మార్చి.

ఈ విషయం చర్చించటానికి బాదల్‌కు పెద్దగా ఇష్టం లేదు. "లోనికి పదండి. అన్నీ మాట్లాడుకోవచ్చు." అన్నాడు.

కాని లోపలికెళ్ళిన తర్వాత చర్చలేమీ జరగలేదు. అన్నం వడ్డించినంతసేపూ పన్నాలాల్ ఏవో అర్థంలేని మాటలు, అర్థంగాని విధంగా మాట్లాడుతూనే వున్నాడు. అటు 'బాదల్' కొడుకులూ ఏవో అర్థంలేని జవాబులు ఇస్తూనే వున్నారు. 'బాదల్' చల్లగా ఏటికేసి వెళ్ళిపోయాడు.

పన్నాలాల్ బహు నెమ్మదిగా భోంచేశాడు. కాని నిజానికి చాల తక్కువగానే తిన్నాడు. భోజనాల అనంతరం అంతా ఇంట్లో ప్రాంగణంలోనే కూర్చున్నారు. గడపదాటి లోనికి పోయేసమయంలో తాను ప్రశ్నించినదానికి జవాబేమీ రాక పోయే టప్పటికి పన్నాలాల్ మనస్సు చీకాకు పడసాగింది. బాదల్ ఏటినుంచి తిరిగివచ్చాడు.

బాదల్‌తో యేమీ సంభాషించక తనదగ్గరకొచ్చి కూర్చున్న పెద్దకొడుకుతో నెమ్మదిగా ఏదో గుసగుసలు ప్రారంభించాడు పన్నాలాల్.

"బజటూ వాళ్ళదగ్గరనుంచి సమాచార మేమీ రాలేదా?" అని అడిగాడు పన్నాలాల్.

"మాకు వారి సమాచారాలతో నిమిత్తంలేదు. మా అంచనాలన్నీ అడుగంటిపోయాయి." అన్నాడు పెద్దకొడుకు.

"ఐయితే ఇప్పుడిక జరగవలసిన దేంటి? కొంచెం జటిల సమస్యే." అన్నాడు పన్నాలాన్.

"జరగవలసిందేముంది? జరగవలసినదేదో నిర్ణయిం చుకునే వున్నాం."

పన్నాలాల్ అతని మొగంకేసి చూడసాగాడు.

బాదల్ పన్నాలాల్ వద్దకొచ్చి "యింకా పెద్దగా ప్రొద్దేమీ పోలేదు. పిండి ఆరబోసినట్లు వెన్నెల విరియబోసి వుంది వెంట మనిషిని ఏర్పాటుచేస్తా. వెళ్ళటానికి పెద్దగా యిబ్బందేమీ వుండదు." అన్నాడు.

పన్నాలాల్‌కు వెళ్ళాలనిలేదు. కాని బాదల్ మాటలు స్పష్టంగా వున్నాయి. గత్యంతరంలేక అయిష్టతతోనే సైట కొచ్చాడు. 'పహాడీ' వైపుకు బయలుదేరాడు. ఒక మనిషి వెంటనడిచాడు. ఊరు వెలుపలిదాకా పంపించివద్దామని బాదల్ కొడుకుకూడ వెంటవెళ్ళాడు.

ఊరివెలుపలి రావిచెట్టుదగ్గరనుంచి దారి రెండుగా చీలిపోయింది. ఒకటి అడవిగుండా చుట్టు తిరిగిపోతే, రెండోది మైదానంలోనుంచి తిన్నగా 'పహాడీ' దాకా పోయింది. అడ విలోగుండా వెళ్ళేదిలేదు. బహుశా ఈ కారణంచేతనే వెంట వచ్చిన నౌకరును ముందు పోతూండమని ఆజ్ఞాపించాడు. నౌకరు కాస్త ఎడంగా పోయినతర్వాత పన్నాలాల్, 'బేతాలి' యిద్దరూ రావిచెట్టుకు కొంచెం పెడగా వెళ్ళి ఆగిపోయారు.

"ఇవ్వాళకిక్కడ వుండిపోతే కొన్ని విషయాలు మాట్లా డుకోటానికి వీలయ్యేది. ముసలివాళ్ళతో చర్చించాలన్నా, వాళ్ళముందు మాట్లాడాలన్నా చాల సంకోచంగా వుంటుంది." అన్నాడు పన్నాలాల్.

"నాన్నగారు ఒక ముఖ్యమైనసంగతి మీతో ముచ్చ టించవలసివుంది. మరెందుకు ముచ్చటించలేదో? నాకు ఆశ్చ ర్యంగావుంది." అన్నాడు 'బేతాలీ'

"ఏమిటిది?" అని అడిగాడు పన్నాలాల్ చాల కుతూహలంతో.

"విషయమేమంటే, 'బజటా' వాళ్ళతో తెగతెంపులు చేసుకోదలిచాం. ఒకరకంగా తెగిపోయాయనే చెప్పవచ్చు కాని ఈడొచ్చిన పిల్లను ఎంతకాలంవరకు ఇంట్లో అట్టిపెట్టి వుంచుకోగలం?" అన్నాడు.

"మీరన్నదానిలో తప్పేమీలేదు. మంచిరోజులుకావు. కాలం బొత్తిగా మారిపోయింది."

"రోజులు మంచివిగాని మంచివిగాకపోనీ, ముందు మా తలబరువు దించుకోవటం అవసరంగదా."

"ఈవిషయంలో నా సహాయమేమైనా అవసరమనుకుంటే చెప్పటానికి సంకోచించకండి. శక్తివంచన లేకుండా తోడ్పడటానికి సిద్ధంగావున్నా."

"ఎవరితోనూ చెప్పగూడదుసుమా."

"అలాంటి దెన్నడూ జరగదనుకోండి." "ఇంకా సరిగ్గా నిర్ణయం జరగలేదు. కాని మీకిచ్చిచేయాలనివుంది."

"అరే! నాకేంటీ, మీ అమ్మాయిని ఇవ్వటమేమిటి ? చాలా గొప్ప సంగతే వినిపించారే!" అన్నాడు పన్నాలాల్ కంఠస్వరం ఆశ్చర్యవంతంగామార్చి.

"ఇవ్వాళనే అన్నీ నిర్ణయాత్మకంగా మాట్లాడుకోవాలన్నమాటలు. కాని 'బాదల్'గా రెండువల్ల ఆ విషయాలు మీతో చర్చించలేదో తెలియకుండావుంది. ఆషాఢమాసం వస్తోంది. ఆ నెలలో చేయటానికి వీల్లేదుగదా. దీని అర్థం ఇప్పుడిది శ్రావణభాద్రపదమాసాలవరకు దేకుతుందన్నమాట."

దీనివల్ల పన్నాలాల్‌కు విచారమేమీ కలగలేదు. కాని ఆశకు అభిలాషకూ ఒక గొప్ప ఆధారం మాత్రం దొరికింది.

వారిద్దరూ వెళ్ళిపోయిన తర్వాత రావిచెట్టు క్రీనీడ లోంచి ఒక 'నీడ' బయలుదేరింది. అది నెమ్మదిగా వాగు దారిన వెళ్ళిపోయింది.

# 10

'గంగాదసరా' రోజున తాను చూచిందీ, విన్నదీ దేవసింహుడు మరచిపోలేదు. 'రామా'ను 'పహాడీ' రాడీ చేతుల కప్పగించటాన్కి తప్పక కుట్రఏదో జరుగుతోంది. ఇలాంటి కోమల, మృదుల, మనోహర విగ్రహాన్ని ముక్కలు ముక్కలు చేసి పెంటపోగుపాలు చేయనున్నారు. పన్నాలాల్ అంటే రామాకు రవ్వంతకూడ ఇష్టంలేదు. బలవంతగా ఆమె మెడలు విరుస్తున్నారు. ఆహా! ఏం చూపులు? వాటిలో ఎంత వినయం, ఎంత ప్రేమ నిండివుంది! ఆ నేత్రాలు! ఆ ముఖబింబం! తప్పక వసుపురంగు మిశ్రిత అరుణరేఖలతో నిర్మించబడినట్టుగా వుంది. అది ఆ పాపాత్ముడు స్పర్శించతగిందా? నా పత్ని! అగ్ని సాక్షిగా చేసుకున్న నా భార్య! నేను బ్రతికుండగానే పరపురుషుడికి అంటగట్టబడటమా! వియ్యంకుళ్ళిద్దరూ బూతులకు దిగిన ఆ ఘడియ ఏం ఘడియో; ఆ పాపపుఘడియ ఎన్నడు నాశనమౌతుందో గదా!

గంగాదసరా వెళ్ళిన మర్నాడే దేవసింహుడు మళ్ళీ 'బరాల్' వెళ్ళటాన్కి నిశ్చయించుకు కూర్చున్నాడు దేవసిం

హుడు. కొడుకు ఇరవైనాలుగుగంటలూ మౌనంగా ఉండటం, ఏదో రహస్యమయ చింతతో గ్రస్థుడై వుండటం చూచి 'శిబూ', లోలోపల చికాకు పడుతున్నాడు. మళ్ళీ పెళ్ళిఇంతవరకు చేయలేకపోయినందుకు పశ్చాత్తాప పడుతున్నాడు. ఐనా 'బరాల' ఏదైనా కబురు పంపాలన్న విషయం మాత్రం ఎన్నడూ ఆలోచించిన పాపానపోలేదు.

ఆరోజునే ఒక పెద్ద పెనుగాలి వీచింది. మేఘాలు గర్జిస్తూ గగనమండలమంతా క్రమ్ముకొచ్చాయి. ఆకాశమంతా మేఘాలమయమై పోయింది. చివరకు వెంట్రుకవాసి స్థలంకూడ ఖాళీగాలేదు. మేఘాలు గుబుళ్ళుగుబుళ్ళుగా వచ్చి కడవ పోతగా నీళ్ళు గుమ్మరించిపోసాగాయి. ప్రొద్దుగూకులూ కురుస్తూనేవున్నాయి. రాత్రి తెరిపిలేదు. వాగులు, చెర్వులు, అన్నీ నిండి పొంగిపోసాగాయి. ఎటుచూచినా నేలంతా బురద బురదగాగా వుంది.

'బ్రరాల్' వెళ్ళలేకపోయాడు దేవసింహుడు. వర్షం చాలరోజులవరకు కురుస్తూనేవుంది. ఏరు ఫుల్ గా వచ్చింది. ఎన్నో గుట్టలు కొండలతో యుద్ధంచేస్తూ 'శేతవా' నది బొబ్బలు పెట్టుకుంటూవస్తోంది. వచ్చి రెండు గట్టులకు తన్ను కోటానికి సన్నాహం చేస్తోంది.

బురదలో నడవటం! ఈ ప్రక్కగానే 'బ్రరాల్' కు తిన్నగా వెళ్ళాలంటే మధ్యలో కనీసం పది – పదిహేనన్నా వాగులు ముందుదాటాలి. ఎంత దుస్సాహసంచేసినా చివరకు వెళ్ళిరావాలంటే కనీసం పది పన్నెండు గంటలకాలమన్నా పడుతుంది. చీకటిరాత్రి. ఆపైన మబ్బులు ఒక అడుగుదూరంలో

ముందు ఏమున్నదో కంటికి కనపడదు. కాదు, పగటిపూట వెళ్దామా అనుకుంటే యిటు తండ్రి ఏమనుకుంటాడో, అటు అత్తవారింటిదగ్గర 'బాధల్ చౌధరి', అతని కొడుకులు, తదితర గ్రామస్థులు ఏవిధంగా అభిప్రాయపడతారో తెలియదు.

వర్షం తెరలు తెరలుగా కురుస్తోంది. కాని పూర్తిగా వెలవలేదు. కొండలు, అడవులు, బయళ్ళు అన్నీ పచ్చబడ్డాయి. నేలమీద పచ్చబడని చోటంటూ ఎక్కడా లేదు. ఏమైనా మిగిలివుంటే బురదగుంటలు, నీటిప్రదేశాలు మాత్రం మిగిలివున్నాయి. దేవసింహుడు హతోత్సాహుడు కాసాగాడు. పశువులవెంట తిరగటం ఆగిపోయింది. ఉంటే ఇంట్లో మంచంమీద, లేకపోతే నదిదగ్గర రాళ్ళవొడ్డుమీద వాకాయచెట్లు దిట్టంగాపూసి సువాసనలు వెదజల్లుతున్నాయి.

కాని దేవసింహునకు 'బరాల్' సంగతులేమీ తెలియలేదు.

ఒకరోజున కొడుకు విచారంగా వుండటంచూచి, తన కున్న బుద్ధితో సరిగా అంచనా వేసి, "వచ్చే మార్గశిర మాసంలో పెళ్లి తప్పక చేస్తానులేరా" అన్నాడు తండ్రి 'శిబూ' మహతో.

దేవసింహుని వైపునుంచి జవాబు శూన్యం.

# 11

ఇప్పుడు దేవసింహునకొక కొత్తపిచ్చి నెత్తికెక్కుతూ వ్చుంది. ఎండుసొరకాయలు ప్రోగుచేసి సాయంకాలమప్పుడు ఏటిలో ఈత ప్రాక్టీసు ప్రారంభించాడు. తండ్రి అడిగితే, "ఒక్కొక్కరోజున ప్రొద్దుట స్నానానికి ఆలస్యమవుతోంది. ఆ ఎండలో స్నానంచేయటానికి బాగుండటంలేదు." అని సమాధానం చెప్పేవాడు.

సాయంకాల స్నానం క్రమంగా రాత్రి స్నానంలోకి మారింది. మొదట్లో కొంతదూరం ఈది మరల తిరిగి వచ్చేవాడు. తర్వాత నెమ్మది నెమ్మదిగా ఎక్కువదూరం పో ప్రారంభించాడు. నీళ్ళలో పెద్దపెద్ద రాతిబండలు, గుట్టలు, సుడిగుండాలు ఎక్కడెక్కడవున్నాయి? ఎక్కడ ఏవిధంగా వాటినుండి తప్పించుకోవాలి? ఇంత విస్తరించివున్న నీటిప్రవాహాన్ని ఎటుగా ఈదితే తక్కువసమయంలో దాటటానికి వీలుంది? మున్నగు వాటిని తెలుసుకుని తండ్రి ఎంతవద్దన్నా కొద్దిరోజుల్లోనే ఈతలో ఆరితేరాడు.

ఒకనాటి రాత్రి మబ్బులు తెరలుతెరలుగా వచ్చి ఆకాశమండలాన్ని ఆవరిస్తున్నాయి. ఒకసారి చీకట్లు క్రమ్ముకొస్తే, మరొకసారి మబ్బులు విడిపోయి పండువెన్నెల వెదజల్లుతోంది. నడిరేయివేళ, సొరకాయబుర్రలు నడుముకు కట్టుకుని ఏటికి బయలుదేరాడు దేవసింహుడు. 'బేతవా' రెండుగట్లులకు తన్నివుంది. బ్రహ్మాండంగా ఉరకలుతీస్తూ పోతోంది. ఒకకర్ర తీసుకొని మంచి ఉరవడిగావున్నచోట నీటిలోకి దుమికాడు.

'బేతవా' గర్భంలోనే సమాధికావాలని అంతగా వ్రాసివుంటే అది ఇవ్వాళనే అవుతాను, "ఇంకోకరోజు ఎందుకుమళ్ళీ?" అని దృఢమైన సంకల్పంతో దూకాడు.

బండలు, గుట్టలు, సుడిగుండాలు తప్పుకుంటూ షుమారు మైలుదూరం పోయాడు. ముందు మైలుదూరంలో 'రాజాబేగర్' అనే ప్రచండమైన జలప్రపాతంవుంది.

అచ్చట 'బేతవా' నది మొదటిపాయ వర్షాకాలంలో ఎక్కువ వెడల్పు వుండదు. మహాఉంటే వంద వందన్నర గజాల వెడల్పువుంటుంది. అక్కడ వెన్నెలరాత్రిలో కోటానుకోట్ల కిరణాల మందపాటి దుప్పటి ఆకాశాన్నుంచి క్రిందికిలాగబడి నెమ్మదిగా జరిగిపోతున్నట్టుగా కన్పిస్తుంది. రాతిబండల పొడి ఆ మెత్తటి దుప్పటి అనంత, చంచల గర్భంలోకి వెళ్ళుతో స్తోంటుంది. ప్రతిక్షణం జలరాసుల సముదాయం కళ్ళుచెదరి పోయే వడితో ముందుకు పోతోంటుంది. పాతాళలోకాన్ని ఛేదించటానికి పరుగెత్తుకుపోతున్నట్టు.

దేవసింహుడు సొరబుర్రలతో ఆవైపుకే తోసుకుపో బడుతున్నాడు. ఆ ప్రదేశం సంగతి అతనికి బాగా తెలుసు. అక్కడికి వెళ్ళి మళ్ళీ తిరిగివచ్చిన ఈతగాడెవడున్నాడు?

దేవసింహుడు ఈదుకుంటూ, కొట్టుకుపోతూ చేరిన చోటునుంచి ఏరు రెండుపాయలుగా చీలింది. ఒకటి ఈశాన్య మూలగా పోతే, రెండోది నైరుతి మూలగా పోయింది. ఈరెండో పాయలోవుంది 'రాజాబేగర్' భయంకరప్రాంతం.

ఈశాన్యమూలగా పోయిన పాయవైపుకు తన యావ చ్ఛక్తినీ వినియోగించి బారలు వేయసాగాడు దేవసింహుడు.

ఏరు మంచి పురవడిగావుంది. ఎంతో శ్రమపడి ఎలాగైతే నైరుతి మూలపాయలోకి కొట్టుకుపోకుండా బైటపడ్డాడు. ఈ చీలినపాయలకింత దగ్గరలోకి రాకపూర్వమే మేల్కొని రెండో వైపుకు మరలివుంటే ఇంత శ్రమపడవలసిన అవసరముండేది కాదు.

'బేతవా' లో ఈ ప్రదేశంలో అనేక లంకలు ఏర్పడి వున్నాయి. వీటి మధ్యనుంచి పెద్దపెద్ద వాగులుగా ఏర్పడి ఒక పాయ రెండోపాయతో వచ్చి కలుస్తోంటుంది. ఇందులో ఒక దానిగుండా అవతలివేపుకు చేరాడు దేవసింహుడు. ఒడ్డు వెంబడే నెమ్మదిగా కొట్టుకుపోయి కొంచెంసేపటిలో 'బరాల్' క్రిందకెళ్ళిపడ్డాడు.

# 12

వర్షాకాలంలో కుక్కలు గుంపుకట్టుకొని ఇళ్ళబైట వుండవు. అందుచేత దేవసింహుడుదారిలో ఏ విశేషవిఘ్నమూ లేకుండా 'బాదల్' చౌధరి ఇంటికి చేరుకోగలిగాడు. తన సొరకాయ బుర్రలు నీళ్ళలోనే వదలివచ్చాడు.

"ఆరు నూరైనాసరే, ఇవ్వాళమాత్రం కలుసుకోకుండా తిరిగి వెళ్ళేది లేదు. చివరకు తెల్లవారుజామున దర్శనం లభించినా నష్టంలేదు. ఈ వేపుగుండానే అడవుల దారిన వనుగులమీాద పోతా. 'భర్రాల్' రేవుకు కొంచెం పైకిపోయి ఏరు ఈది ఇంటికి చేరుకుంటా. అంతగా నాన్నగారడిగితే "ఏరు దాటిపోయాను. చీకటిపడింది. దారి తెలియలేదు. అందుచేత

ప్రొద్దుపొడిచినతర్వాత వచ్చానని చెబుతా! అని దృఢంగా నిశ్చయించుకొని 'చౌధరి' ఇంటిదాకా వెళ్ళాడు దేవసింహుడు.

ఈవిధంగా తప్పుగాని లేక ఒప్పుగాని ఒక నిర్ణయం ద్వారా తన మనస్సును స్థిమితపరచుకొన్నాడు. ఇంతలో అతని ధ్యాస ఇంతకు కొద్ది రోజులక్రితమే తాను చేసిన ప్రతినవేపుకు మరిలింది.

చంద్రుడు బాదల్ చౌధరి ఇంటిచాటున వున్నాడు. అత్తగారింటి మిద్దెక్రింద నీడలోకూర్చొని లోపల నిద్రపోతూ వుండొచ్చునని వూహిస్తూ తెరచివున్న కిటికీకేసి చూడసాగాడు దేవసింహుడు. తనలో తాను వూహాగానం చేస్తున్నాడు – "విశాల నేత్రాలు ఈ మిద్దెలోపలనే ఎచ్చటో సంయుక్తమై వుంటాయి. కనురెప్పల పొడుగైన వెంట్రుకలు పరస్పరం కలుసుకుని నున్నటి కనురెప్పలకు విశ్రాంతి ఇస్తూం డొచ్చు. శిరోజములు చెదరి, విరజిమ్మి వుండొచ్చు. కాని ఈస్థితి తక్షణం మారిపోవటం అవసరం, లేకపోతే తెల్లవారు జామువరకు ఇక్కడిలాగే వుండిపోతే, స్త్రీ పురుషుల గమనా గమనం ప్రారంభమైతే కలుసుకోవటంమాట అటుంచి, అసలు కళ్ళతో చూడటమే అసంభవమైపోతుంది. ఐతేమరి ఇప్పుడు చేయవలసిన కర్తవ్యమేమిటి? బాదల్‌చౌధరిగారు గాని లేక రామా సోదరులుగాని చూస్తే ఏమంటారు? ఊళ్ళోవాళ్ళంతా ఏరకంగా ఛీ ఛీ అంటారు? నాన్నకు తెలిస్తే సిగ్గుతో పదుగురిలో తలఎత్తుకోలేక ఎంతబాధపడ్తాడు? కాని ఏవుద్దేశ్యంతో ఇంత శ్రమకోర్చి నానాబాధలుపడి ప్రాణాన్ని సైతం లెక్కచేయకుండా వచ్చానో దాన్ని సాధించకుండానే తిరిగి వెళ్ళనా?"

కుక్కలన్నా కనపడితే వాటిదృష్టిని తనవేపుకు ఆక ర్షించి వాటితోనైనా కాస్త గల్లంతు చేయించుదామనుకుంటే. అవీ కన్పించటంలేదు. దానివల్ల 'ఎవరన్నా' మేల్కొనన్నా మేల్కొంటారు. ఔను, అందరూ మేల్కోవద్దులే. 'ఒక్కరు' మాత్రం మేల్కొంటే సరిపోతుంది. ఒకసారి పూర్తిగా నిరాశ చెందాడు. తిరిగిపోవాలని అనుకొన్నాడు.

వర్షాకాలంలో గ్రామాల్లో కుక్కలు సామాన్యంగా ఏ ఇళ్ళల్లోనో, ఏ గుసెడిల్లోనో దూరివుంటోంటాయి. కాని అవసరమైతే తేలిగ్గా చప్పున బైటికి రావటానికి వీలుగావుండే చోట్లనే పడుకుంటాయి. అందుచేత దేవసింహుడు బాదల్ చౌధరి ఇంటివరకూ ఏ ప్రమాదమూ లేకుండానే నిశ్శబ్దంగా వెళ్ళగలిగాడు. అంతేగాదు, అక్కడ కూర్చొని ఎడతెగని ఆలోచనల్లో సతమతమవుతూన్నంతవరకూ కూడ ప్రమాద రహితంగానే వున్నాడు. కాని కూర్చొని కూర్చొని విసిగి పదే పదే ఏదో చేయాలనీ, మరల చేయలేమనీ ఆలోచిస్తూ ఏమీ తోచక 'బాదల్' ఇంటిచుట్టూ షికార్లు కొట్టసాగినపుడు చుట్టు ప్రక్కలవున్న కుక్కలూ మేల్కొన్నాయి.

ఒకటి మొరిగింది; రెండోది మొరిగింది. తర్వాత అన్నీ ఒక్కసారి భౌం భౌం అన్నాయి. ఈ అరపులు, ఈ గల్లంతు విని దేవసింహుని గుండెలు కొట్టుకోసాగాయి. కుక్కల గోల కొరకు ఇంతగా ఆరాటపడిన మనిషికి ఇప్పుడా గోలచూచి కంగారు పుట్టింది. "బాదల్ లేస్తాడు. కొడుకులు లేచి బైటికొస్తారు. ఊరంతా ప్రోగవుతుంది. ఇష్టమొచ్చినట్లుగా మాట్లాడతారు; ఎగతాళిచేస్తారు. పరిహాసోక్తులాడతారు. తర్వాత

మా వూళ్ళో నాన్నకు తెలుస్తుంది. ఐతేమరి ఇంత కష్టపడి రావటం దేనికి? ప్రాణాలు చిక్కులో దేనికిపడ వేసుకోవాలి? ఎవరినిమిత్తం పడ వేసుకోవాలి?

నా పత్ని; అగ్నిసాక్షిగా నేను పాణిగ్రహణం చేసుకున్న భార్య ఆవిడమీంద నాకధికారముంది. అదెవ్వరూ లాక్కోజా లరు. ఆవిడ ఇష్టం డింకొకరికి చెందజాలదు. ఆవిడకోసమే వచ్చాను. కేవలం ఒకసారి దర్శించిపోవాలన్న వుద్దేశ్యంతోనే వచ్చాను. అంతకుమినహా మరో అభిలాష లేదు. ఎవరైనా ఏమైనా అనుకుంటే అనుకోనీ, దానితో నాకేమిటి సంబంధం? నేనెవరినీ దొంగిలించటానికి రాలేదు. ఎవరిభార్యనూ ఎత్తుకు పోవుటకు రాలేదు. బాదల్, అతని కొడుకులు ఏమన్నా అంటే సరియైనసమాధానమే చెప్పగలను. ఈ వ్యవహారాన్ని గురించి నేనేం ఆలోచిస్తున్నానో, నాభావాలేమిటో వారికి అర్ధమౌ తాయి. నా భావా లెరుగకపోయినందువల్ల కూడ బాదల్ చౌధరిగారు ఈరకమైన ఆలోచనల్లోపడివుంటే పడివుండవచ్చు. సరే బాగానేవుంది; కాని అక్కడ 'బజటా' లో ఎలావుం టుంది? ఏంజరుగుతుంది.

కుక్కల గల్లంతు మరింత పెరిగింది.

ఇంతలో ఎవరో బాదల్ చౌధరి ఇంటి తలుపులు తెరి చారు.

# 13

బాదల్ చౌధరి ఇంట్లోంచి ఎవరో ఒకరు బైటకొచ్చారు. నిక్కరులా కట్టుపంచె మోకాళ్ళపైకి దోపి కట్టుకొని లాఠీ తీసుకు నిర్భయంగా దేవసింహుని దగ్గరకొచ్చి 'ఎవరునీవు' అని ప్రశ్నించాడు.

దేవసింహుడు ఒకక్షణంపాటు కొయ్యబారినట్లు స్తంభించి నిలుచున్నాడు.

ఆ మనిషి మరికాస్త దగ్గరకొచ్చాడు. లాఠీ సంభాళించాడు. దేవసింహుడూ రిక్తహస్తాలతోలేడు. ఆమనిషి బాగా పరీక్షించి చూశాడు. ఒక అడుగు వెనక్కితగ్గి మళ్ళీ "ఎవరవునీవు" అని అడిగాడు నెమ్మదిగా.

గొంతు సవరించుకొని "మనిషిని" అన్నాడు దేవసింహుడు.

"అరే! మనిషివని నాకుమాత్రం కన్పడటంలా?" అంటూ "పో పో; ఇదేమంత మంచిపనికాదు. ఏమిటీపని!" అన్నాడు ఆ మనిషి.

ఇంతలో గుమ్మందగ్గరనుండి "అన్నా! ఎవరామనిషి?" అన్నా డెవరో బిగ్గరగా.

"పో పో; లేకపోతే అనవసరంగా ప్రమాదానికి లోనవుతావు." అన్నాడు నెమ్మదిగా ఆ మనిషి దేవసింహునితో.

దేవసింహుడు ఇండ్ల నీడచాటున చల్లచల్లగా వెనక్కితగ్గాడు.

అతన్ని పొమ్మని చెప్పిన మనిషి ఇంట్లోకి తిరిగిపోసాగాడు. ఇంతలో మొదట గుమ్మంలోనుంచి కేకవేసిన మనిషి ఎదురొచ్చి "అన్నా! అతనెవరేమిటి?" అని అడిగాడు మళ్ళీ.

ఇతను బాదల్ కొడుకు 'బేతాలీ' ప్రశ్నింపబడిన వ్యక్తి బాదల్ చౌదరి.

"ఎవడోలే; పద లోనికి. ప్రపంచంలో వచ్చేపోయే వాళ్ళకు తక్కువ ఏముందిలే. పోయి తలుపు వేసుకుపడుకో." అన్నాడు బాదల్ చౌదరి.

"చీకట్లో మీదగ్గరనుంచి ఎవరో వెళ్ళినట్లుగా కన్పడిందే. ఎవడైనా దొంగ కాదుగదా?" అన్నాడు బేతాళీ. తర్వాత దేవసింహుడు పోయినవైపుకు పోవటానికి ఉద్యుక్తుడుగా కన్పించాడు.

బాదల్ అతని చెయ్యిపట్టుకొని వారించాడు. ఇంతలో మిద్దెగది కిటికీలోనుండి ఎవరో తల బైటకుపెట్టారు. ఇది తండ్రీ కొడుకులలో ఏ ఒక్కరూ గమనించలేదు.

బాదల్ కొడుకుతోసహా లోపలికిపోయి తలుపు వేసుకున్నాడు.

దేవసింహుడు చీకట్లో చల్లగా జారుకున్నాడు. కాని పూర్తిగా వెళ్ళిపోలేదు. తలుపులు మూసిన తర్వాత మళ్ళీ నెమ్మదిగావచ్చి తల కన్పించిన మిద్దెగది కిటికీ దగ్గరకుచేరాడు.

తన్ను వెనక్కిపంపించటానికి, మరల తిరిగి రప్పించటానికి కారణభూతమైన 'శక్తి' ఏదో అతనికి తెలియలేదు. కిటికీ వెనకవున్నదెవరు? తలకాయ బైటకుపెట్టిన మనిషి ఎవరు?

కుక్కలు మొరుగుతున్నాయి. నది బొబ్బలు పెట్టు కుంటూ పరుగులుతీస్తూ పోతోంది. నిశాకరుడు మబ్బుల్లో దాగుడు మూతలాడుతున్నాడు. నిశ్శబ్దంగా, నిశ్చేష్టుడై నిల్చొని ఉన్నాడు దేవసింహుడు. అతనికంతా అగమ్యగోచరంగా ఉంది. వింటున్నదీ ఏమీలేదు. కేవలం కళ్ళుపెట్టుకు చూస్తున్నాడు. ఏదో మనస్సులో వూహించుకొని కదలకుండా కాలు మోపి క్రింద నిలబడిఉన్నాడు.

కిటికీలోనుంచి తొంగిచూచిన మనిషీ అక్కడేఉన్నాడు.

దేవసింహుడు చూశాడు; బాగా గుడ్లు తెరచి చూశాడు. ఏదో వూహించుకొన్నాడు. కాని ఏ ఆకృతిని, ఏపోలికను, ఏ అందాన్ని, ఏ ప్రేమను మనస్సులో సృష్టించుకొన్నాడో తెలియదు.

ఇంతలో ఇంటిలోంచి "రామా" అని పిలిచింది ఏదో ఒకగొంతు.

కిటికీ వెలుపలనున్న తలకాయ వెనక్కిపోయింది. ఆ గొంతు మరల అదేవిధంగా పిలిచింది. 'ఆ' అని జవాబు దొరకినమీదట మళ్ళీ బిగ్గరగా ఎవరో "రామా!" అని పిలిచారు.

దానికి బద్ధకంతో, నిద్రమగతతోవున్న కంఠంతో మిద్దె మీదనుంచి "ఏమిటి? ఎందుకు అలా అరచుకుంటావు? నిద్ర పోనివ్వవేమిటి? అంది రామా.

"ఆవిడే; తప్పక ఆవిడే" అనుకున్నాడు దేవసింహుడు.

"ఇంట్లోవాళ్ళంతా నిద్రచెడగొట్టుకున్న అనవసరంగా కంగారు పడటం దేనికి? నే చెబుతున్నాగా ఎవరూ లేరని, వెంటల

కుండా పడుకో; తతిమ్మావాళ్ళనుకూడా సుఖంగా నిద్రపోనీ. ఇంట్లో మూలమూలా అలాగాలించటం దేనికి లోనికెవ్వడో వచ్చి దూరి కూర్చున్నట్టుగా?" అన్నారొకరు లోపల నుంచి.

ఇంతలో ఇరుగు పొరుగు ఇళ్లలోనుంచి "ఏమిటండీ? మమ్మల్నికూడ రమ్మంటారా? చౌదరిగారూ?" అని కేకలు వచ్చాయి.

దేవసింహు డక్కడే కూర్చునివున్నాడు. కాని ఆమాట లేపి విన్పించనందున కిటికీవేపుకే రెప్పవాల్చకుండా చూస్తు న్నాడు.

"వద్దువద్దు. ఏమీలేదు. ఎవరూ బైటికి రావలసిన పనిలేదు. హాయిగా పడుకోండి." అన్నాడు బాదల్ చౌదరి బిగ్గరగా తన గదిలోనుంచి.

తర్వాత కొన్ని నిమిషాలవరకు అంతా ప్రశాంతంగా వుంది. కుక్కలుమాత్రమే మొరుగుతున్నాయి.

దేవసింహుడు కదలకుండా అక్కడే నిల్చునివున్నాడు. కిటికీయూ తెరచేవుంది. అతనికళ్ళు మిద్దెలోపల చీకట్లో ఎవరి కోసమో వెదక్కుంటున్నాయి. కాని ఎంతవెదకినా ఏమీ కన్పించటంలేదు. కిటికీలోనుంచి మళ్ళీ తలకాయ బైటికివస్తే ఈసారి ఏదో ఒకమాట చెప్పాలన్న ఆశమాత్రమే మిగిలివుంది.

ఒక ఘడియ గడిచింది; రెండు ఘడియలు గడిచాయి; సందులోని చీకటి మరింత దట్టమైంది. కుక్కల మొరుగులు చాలవరకు తగ్గాయి. కిటికీతలుపులూ అలాగే తెరచివున్నాయి. కాని అందులోనుంచి మాత్రం ఎవరితలా బైటికిరాలేదు.

బాధ, వేదనా, నిరాశ, అభిలాషలవేగాలమధ్య నలిబిలి య్యిపోతున్నాడు దేవసింహుడు. ఆ మనిషి తప్పక ఆవిడే. ఐతే తలకాయ మళ్ళీబైట కెందుకు పెట్టడంలేదు? సరిగ్గా గుర్తించ లేకపోయినా కనీసం ఆకారం చూచి అన్నా సంతృప్తి పడ్తా.

కాని అలా జరగలేదు.

దేవసింహు డప్పుడు నెమ్మదిగా దగ్గాడు. లేక నిజంగా దగ్గు వచ్చిందో, ఎంతో అభిలాషతో గట్టిగా కిటికీకేసి దృష్టినిగిడ్చి నిలబడ్డాడు. ఎవరో కిటికీ వేసుకున్నారు.

దేవసింహుడు నెమ్మదిగా, కాని స్పష్టంగా "ఇదిగో... నేను...మీరు...నేను దేవసింహుణ్ణి 'బజటా'" అన్నాడు.

ఐనా కిటికీ మళ్ళీ తెరచుకోలేదు.

# 14

రెండురోజులతర్వాత పెద్ద పండగేమీ గాకపోయినా పన్నాలాల్‌ను భోజనానికి పిలిచాడు. 'బేతాలీ'. భోజనవేళకు కొంచెంముందుమాత్రమే తన తండ్రికీసంగతిచెప్పాడు.

బాదల్ లోపల కోపగించుకున్నాడు. కాని పైకిమాత్రం ఏమీ కనబడనీయలేదు. "ఇవ్వాళ పండగేమీకాదే. ఐనా భోజనానికి పిలిచి మంచిపనేచేశావులే." అన్నాడు తన కేమీ అభిరుచిలేనట్లుగా.

"అన్నా! ఒక ప్రత్యేకవుద్దేశ్యంతో అలాచేశాను. ఈడొచ్చిన పిల్లనెంతగాలమని ఇంట్లో వుంచుకొంటాం?" అన్నాడు బేతాలీ.

"ఇంకా వానాకాలమేగడరాబాబూ. ఈకాలంలో ఎవరింటికైనా పెళ్ళివారు రావటం ఎప్పుడైనావిన్నావా? మార్గ శిరమాసం దొరబడనియ్యి; అప్పుడు ఆలోచిద్దాం. ఒకవేళ 'బజటా' వాళ్లుఅప్పటికి తాముచేసినపనికి పశ్చాత్తాపపడతా రేమోచూద్దాం" అన్నాడు బాదల్ ప్రేమపూర్వకంగా, కాని కొంచెంకోపంగా.

'బజటా' వాళ్ళతో తలపగలగొట్టించుకోవటమొక్కటే ఇకమిగిలివుంది. ఆనీచులు అంతమందిలో బహిరంగంగా 'మా కక్కరలేదు. మీా ఇష్టమొచ్చినచోట చేసుకోండి' అని స్వస్తి చెప్పిపోయారు. ఐనా మీారింకా ఆనీతిలేనివాళ్ళనే పట్టుకుని ఎందుకు వ్రేలాడుతుంటారో నాకర్థంకావటంలేదు." అన్నాడు బేతాలీ నిస్సంకోచభావంతో.

"వదలిపెట్టిపోవటం అంతతేలికనుకొన్నావా ? కులస్థులచేత తగినశాస్తి చేయించకుండా వాళ్ళనంతతేలిగ్గా వదలిపెడ్తాననుకున్నావా?"

"కులస్థులచేత ఎవరికి శాస్తీగీస్తీచేయించాల నాకేం కోరికలేదు నాకున్నకోరికల్లా ఒకటే; మాచెల్లి కాస్త మంచి కొంపలోపడిపోతే అదేపదివేలు. అదే మా పుణ్యానికి ప్రతి ఫలమూ, 'బజటా' వాళ్ళపాపాలకు శిక్షా అని అనుకుంటాం" అన్నాడు బేతాలీ కొంచెం ప్రశాంతంగా.

"సరే, మార్గశిరమాసంలో చూద్దాం." అన్నాడు బాదల్ నమ్మకంగా.

"చేయవలసిన కర్మకాండయంతా మార్గశిరమాసం లోనో లేక మీాకెప్పుడిష్టంగావుంటే అప్పుడే చేసుకోండురు.

కాని ఇప్పుడు మాట్లాడుకుని ఖాయంచేసుకుంటే బాగుంటుంది" అన్నాడు బేతాలీ మళ్ళీకాస్త ఆవేశంతో "మీరొకవేళ నిర్లక్ష్యంచేస్తే మన పరువుప్రతిష్టలన్నీ మంటలో కలిసిపోతాయి. తర్వాత మనం ఎవరిముందూ తలఎత్తుకుతిరగలేం." అన్నాడు.

కొడుకు ఆవేశంపట్ల బాదల్ లోలోపల ఎంతో కోపగించుకున్నాడు. "ఐతే ఇవ్వాళ ఇప్పటికిప్పుడు ఎవరితో ఖాయం చేయమంటావు ? మట్టిపెళ్ళికొడుకునేమన్నా సృష్టించమంటావా ?" అన్నాడు బాదల్ నెమ్మదిగా.

" మట్టిపెళ్ళికొడుకునుగాదు, రక్తమాంసాల వాడినే చూద్దాం. అన్నాడు బేతాలీ నిశ్చయపూర్వక కంఠంతో, మళ్ళీ "పహాడీ' గ్రామం పన్నాలాల్ గారు రూపలావణ్యాలు, తదితరగుణగణాల్లో 'బజటా' వాళ్ళకంటె ఎన్నోరెట్లుమెరుగు. 'శిబూ' గేదెలమీద మోజులేకుండా వుండివుంటే నేనుమాత్రం రామాపెళ్ళి పన్నాలాల్ తోనే చేసివుండేవాణ్ణి." అన్నాడు.

"ఐతే శిబూ మహాతోగారి గేదెలు నా కేమన్నా కావాలనికోరానా? ఆడపిల్ల మంచిచెడ్డలు దృష్టిలో వుంచుకుని సంబంధంచేస్తారు. తర్వాత దాని అదృష్టమే బాగుండనపుడు ఒకరు చేయగల్గిందేముంది?"

"వాళ్లు వదలిపెట్టేసినంతమాత్రంచేత రామా దురదృష్టవంతురాలని అంటే నేనంగీకరించను. కాని నిజంగా పన్నాలాల్ తో వివాహంజరగనిరోజున తప్పక దురదృష్టవంతురాలని అంటా.

"మీ అందరి కెలానచ్చితే అలాచేయండి. నే నింక ఎంతకాలం వుండబోయానులే. ఏది జరిగినా అదంతా మీ బాగోగులకోసమేగదా." అని బాదల్ లోపలికి పోసాగాడు.

బేతాలీ చేతులుజోడించి, కాని వినయరహితంగా "మా కెందుకు? ఇంటికి యజమానులు మీరు. అలాంటప్పుడు మా మాటవినేవాడెవ్వడు ? మీరు స్వయంగా కళ్ళుతెరచి చూడ గోరకపోతే ఎవడేంచేస్తాడు? ఆరాత్రిజరిగిన ఉదంతాన్ని తీసుకుని లోకులేమనుకుంటున్నారో వినిపించటంలేదా ? ఒకడు ఇంట్లోకి దొంగవచ్చి దొరపడ్డాడంటే, ఇంకొకడు కాదు. ఎవడో బద్మాష్ రౌడీ వచ్చి ఆడంగుల గదుల్లో దొరబడ్డాడంటున్నాడు. మరొక డేమో 'బజటా'వాళ్ళు గేదెలు దొంగతనంగా తోలుకుపోవుట కొచ్చారంటున్నాడు. ఎందరినోళ్లు మూయించగలం అన్నాడు. తర్వాత మళ్ళీ ఎంతోబాధపడుతున్నవానిలా – "ఏమైనాసరే, ఇప్పుడీక ఈడొచ్చిన అమ్మాయిని ఇంటిలో వుంచటంమాత్రం మంచిదికాదు. ఇటువంటివార్తలు బైటికిపొక్కాయంటే,ఇరుగు పొరుగు గ్రామాలకు వ్యాపించాయంటే మన తలకాయలు పోయినాసరే, బజటావాళ్ళు అమ్మాయిని తీసుకుపోరు. ఆ తర్వాత మరొకడుకూడా అంగీకరించడు." అన్నాడు.

"బజటా' మనిషి యని ఎవడురా? అంది" అని అడి గాడు బాదల్ లోనికిపోకుండా నిలబడి.

ఇళ్ళల్లో అమ్మలక్కలనుకొంటున్నారు. అంతేగాని మనముందు ఎవ్వడైనా అంటే మొగం పగలగొడ్తాం." అన్నాడు బేతాలీ.

"మరేం విచారం పెట్టుకోవద్దు. ఒట్టుపెట్టుకు చెబుతున్నా. ఈసారి దసరా—దీపావళిపండగలనాటికి రామూ పెళ్ళి ఎక్కడో ఒకచోట తప్పక ఖాయపరుస్తా. ఇక ఆనాటి రాత్రి జరిగినఉదంతం విషయమంటావా; గంగతోడుగా చెబుతున్నా, అతను దొంగగాని, రౌడీగాని ఎవ్వడూకాదు. ఎవడో ఏటిఅవతలి పిచ్చివాడు. మతిపోయి, వూరికే తిరుగుతూంటాడు. ఇంకెప్పుడూ మళ్ళీ రాడనుకో." అన్నాడు బాదల్.

ఇలా అని లోనికి పోయాడు.

ఈ సమాధానం బేతాలీకి తృప్తికలిగించిందో లేదో బహిరంగపరచే అవకాశం కల్గలా. ఆ సమయంలోనే ముఖాన తిరుసున్నం చుక్కబొట్టు పెట్టుకొని ముస్తాబై వచ్చిచేరాడు. పన్నాలాల్ మహాశయుడు.

పరస్పరం అభివందనలు తెలుపుకున్న అనంతరం "గంగా దసరానాడు తిరుగుప్రయాణంలో దారిలో రాళ్ళదెబ్బలు ఎదురుదెబ్బలతో నానాబాధలుపడ్డాను. అందుచేత ఇవ్వాళ కాస్త పెందలకడనే వెళ్ళటం మంచిదనుకొని వచ్చాను. అంతాక్షేమమేగదా" అన్నాడు పన్నాలాల్ నవ్వి బేతాలీతో.

"మీదయ, కాని ఆరాత్రి వెళ్ళిపోయినతర్వాత మరల ఇటుకేసి దయచేయలేదు. ఏదో పొరపాటునన్నా కాస్త ఒకటి రెండుసార్లు వస్తూఉండండి" అన్నాడు వినయంగా బేతాలీ.

బేతాలీకి మరింత దగ్గరకుచేరి "ఇదిగో భాయీ, నిజం చెప్పాలంటే నాన్నగారివైఖరి చూస్తూంటే ధైర్యచాలటంలా," అన్నాడు పన్నాలాల్.

"ఐనా వస్తూపోతూవుండటంవల్ల నష్టమేమీలేదులెండి, అప్పుడప్పుడు కలుసుకోవటంవల్ల స్నేహ సద్భావాలు పెరుగుతాయేగాని తగ్గవు" అన్నాడు బేతాలీ.

"రావటానికేమిలెండి, ఆలాగే వస్తూవుంటానులెండి. అటు ఇంటిదగ్గరా పెద్దగా తోచుబడి కావటంలేదులెండి. ఊళ్ళో సరసులెవరు చచ్చారులెండి, అందరూ రాక్షసవెధవలే. నిజం చెబుతున్నా, మిమ్మల్ని చూడగానే చిత్తం ప్రసన్నమైపోతుంటుంది. మీతో ఒక ఘడియపాటు సాంగత్యంవల్ల మాసాల తరబడి పేరుకొనివున్న కల్మషమంతా వదలి మనస్సు నిర్మలమైపోతూంటుంది. ఇందులో అబద్ధమేమీలేదు, ఒట్టుపెట్టుకు చెబుతున్నాను." అన్నాడు పన్నాలాల్. "ఇదంత మీదయా. మీసజ్జనత్వమూనూ," బహుశా మీరూ నేనూ బ్రతికినంత కాలం కలసిమెలసివుండే అదృష్టం ఎప్పుడోగాదు, అతిత్వరలోనే కలుగుతుందిలెండి. ఈరోజునగాకపోయినా కనీసం దసరా దీపావళులనాటికైనా అబ్బుతుందనుకోండి." అన్నాడు బేతాలీ నవ్వుతూ.

"ఇప్పుడప్పుడే ఏంముంచుకుపోతున్నదని ఇంతతొందరలెండి. అదీగాక ఈకాలం ఇలాంటి శుభకార్యాలకు తరుణం కూడాకాదుగా." అన్నాడు పన్నానాల్‌నవ్వి ఎంతోనెమ్మదిగా.

"సరే, భోజనానికి వేళమించిపోతోంది. వెళ్ళి భోజనం ఏర్పాట్లుచేస్తా. తర్వాత ఎంతసేపు మాట్లాడుకున్నా ఇబ్బంది లేదు." అన్నాడు బేతాలీ లేస్తూ.

ఆ తర్వాత అతను లోనికిపోయ్యాడు. పన్నాలాల్ జేబులోనుంచి ఒక అద్దంతీసి మొగమూ, మూతీ – ముక్కూ

చూచుకోసాగాడు ఎవరైనా రావటంలేదు గదాయని మధ్య మధ్యలో దిక్కులు చూస్తున్నాడు.

తలగుడ్డ కొంచెం వంకరగా తిప్పుకొని అద్దం మళ్ళీ జేబులో పెట్టేసుకొన్నాడు.

ఆలోచిస్తున్నాడు "రామా ఒకరోజున నాకు లభించి తీరుతుంది. అందుకు మంచిలక్షణాలే కానవస్తున్నాయి. కాని ఆ రోజున నా కేసి చూడకుండా ఆ పల్లెటూరి గబ్బిలాయితో అన్ని మాటలెందుకు మాట్లాడింది?" ఇంతలో లోపలనుంచి కాళ్ళ మట్టెలసవ్వడి చెవులకొచ్చి సోకింది. అతను మనస్సులో "కాస్త తలుపుచాటునుండి చూద్దాం రామా అయితే చూపులుకలుపుతా. లేక ఇంకెవరైనా అయితే పెద్దగా నష్టమూ లేదు. ఈలోపల ఎవరైనా ఇటు కేసివస్తే మంచినీళ్ళ వంకపెడ్తా." అని అనుకొని తలుపు దగ్గరకు చేరాడు.

లోపలి ప్రాంగణంలోకి వచ్చిన మనిషి రామాయే. ఏదో పనిమీద వచ్చింది పన్నాలాల్ వూహించటంలో పొర బడలేదు.

చిరునవ్వు నవ్వటానికి ప్రయత్నించకపోయినా రామా మొగం ఎప్పుడూ కళకళలాడుతూ ముసిముసిగా నవ్వుతున్నట్టు గానే వుంటుంది. అది ఆవిడ సహజసంపద. ముఖం వికసిత గులాబీపుష్పంలా వుంది. మట్టగోచి పెట్టుకుంది దేహం అనవ సర దుస్తులతో కప్పిలేదు. అందుచేత అవయవాల నిగనిగ స్పష్టంగా గోచరిస్తోంది. నల్లటిజుట్టు అందులో కొన్ని వెంట్రుకలుకలిసి జడలా లలాటంమీదుగా చెవులమీదకొచ్చి

వ్రేలాడుతోంది. కళ్ళు ధగధగ మెరసిపోతున్నాయి. వాటి కాంతివల్ల ముఖవర్చస్సుకూడ ఎంతో ఇనుమడిస్తోంది.

పన్నాలాల్ మనస్సులో ఏదో ఒక తీవ్రమైన కోరిక జనించి బాధపెట్టసాగింది. లోపల ఇంకెవ్వరూ లేకపోవటంచూచి తలుపుదాటి మరికొన్ని అడుగులు ముందుకు వేశాడు. రామా దృష్టి అటుకేసి మరలింది.

ఆవిడొకసారి అటుకేసి చూసింది ఏదో వింత చూచి నట్టుగా. అదిచూచి తనపట్ల ఆవిడకు తప్పక కొంత సద్భావ మున్నట్లుగా వూహించుకున్నాడు పన్నాలాల్. ముసిముసిగా నవ్వాడు. ఆ కుటిల ముసిముసినగవులు! చూపుల్ని నిగిడ్చి చూశాడు. కళ్ళతో కాస్త నృత్యంచేయించాడు. ఆ దుష్ట నేత్ర నృత్యం!

కాని ఈ తమాషా చూడటానికి క్షణంకూడ అక్కడ ఆగలేదు. లజ్జాభిమానాలతో క్రుంగిపోయి, కాని రవ్వంత కూడ చలించకుండా లోపలికిపోయింది. పన్నాలాల్ తిరిగి యధాస్థానానికి వస్తున్నాడు. ఇంతలో ఇంటిలోనుంచి బాదల్ వచ్చాడు. అతనిదిఅంతా చూశాడు. అతను చూడటం పన్నాలాలూ చూశాడు. కాని తను ఏదో చూశాడు, ఆ నిషాలో మర్యాద అమర్యాదల బాధ పెద్దగా బాధించలేదు. కొంచెం సేపటికి భోజనానికి పిలుపువచ్చింది. కాని అక్కడ మనస్సుకు ఆహ్లాదకరంగావుండే సంగతులేమీ చెవినపడలేదు. సాయంకాలం ఇంటికి తిరిగిపోతున్నపుడు మనస్సు ఏదో పెద్దగా ఆందోళనపడుతోంది.

# 15

శ్రావణమాసం వెళ్ళిపోయింది. సుభద్ర పెనిమిటి సుభద్రను తీసుకువెళ్ళుటకు వచ్చాడు. మర్నాడు ప్రయాణం. రావిచెట్టుక్రింద అరుగుమీద దీపారాధనచేసి వచ్చుటకు రామానుజతకు పిలచుటకు వెళ్ళింది సుభద్ర. ప్రొద్దుగూకిపోయింది. మబ్బులులేవు. కాని చీకటిరాత్రి. నడిరేయికిముందు వెన్నెల వచ్చేదిలేదు.

దీపాలు వెలిగించి ఇద్దరూ అరుగుప్రక్కన ఒక రాతిమీద కూర్చున్నారు.

"నిండు వానాకాలంలో ప్రయాణం చెప్పుటకు వచ్చాడు బావ. దసరావెళ్ళిన తర్వాత తీసుకుపోతే వచ్చిన నష్టమేమిటో ?" అంది రామా.

"అక్కా, వాళ్ళకొచ్చిన నష్టమేముంది? కాని వదిలేసి కూర్చోటం మాకు చేతకాదు." అంది సుభద్ర.

సుభద్ర ఈమాటలెంతో స్వాభావికంగానే అంది. కాని రామా విని ఒక నిట్టూర్పు విడిచింది.

ఆ మాటలకు మరొక అర్థం కల్పించి "ఎందుకలా నిట్టూర్చటం? కార్తీక - మార్గశిరమాసాల్లో నీవూ వెళ్ళిపోతావుగా." అంది సుభద్ర.

"నీకెలా తెలుసు ?"

"ఇదేగాదు, మరికొన్ని విషయాలుకూడ తెలుసు, కిటికీతలుపులు తెరచివుంటుంది. 'లాలా'గారు రాత్రిళ్ళు దాని

గుండా వస్తూంటారు. పెద్దగా కాదుగాని, ఏవో రెండు మూడు మాటలు మాట్లాడి, గడ్డం నిమిరి చక్కా వెళ్ళిపోతూంటారు."

రామా కంపించిపోయింది. "ఏమిటేమిటీ ? ఏమ న్నావు ? ఎవరు వస్తూవుంటారన్నావు ?"

"ఇంకెవ్వరు? ఆయనే, ఆ 'పహాడీ' రసికసిఖామణి 'లాలా'గారే, ఆయన గాక ఇంకెవ్వరెందుకొస్తారే అక్కా ?" అంది సుభద్ర.

"నాకు ఆ 'పహాడీ' వాడితోగాని, లేక ఇంకొకడితో గాని పనేమిటి"?

"పని వుందో లేదో ఇది నీ మనస్సుకే ఎరుక. ఎంతో గంభీరంగావుంటావు. నోరెత్తి ఎవ్వరికీ ఏమీ చెప్పవు. మనస్సు లోని సంగతి మనస్సులోనే పెట్టుకుకూర్చుంటావు. సరే, ఎంత నోరుమూసుకు కూర్చున్నా కిటికీ తెరచివుండటం, అర్ధరాత్రి వేళ 'పహాడీ' నుంచి లాలాగారు రావటం—ఈ రెండూ గొంతెత్తి కథంతా వాటంతటవే చెబుతున్నాయి. చెప్పవే, నాకంతా తెలుసునంటావా లేదా ? సరే, ఇప్పుడన్నా దాయకుండా ఉన్నది ఉన్నట్టుగా చెప్పవే అక్కా" అంది సుభద్ర.

రామా పకపకా నవ్వుతూ "మామూలంగా కిటికీ తలుపులు తెరవటంకూడ దుర్లభంగానే వుంటోంది. ఓసీ, ఉడకపోసి చస్తున్నా, గాలికోసమని కాస్త కిటికీ తీసివుంచు తున్నా." అంది.

"ఓహో ! ఇప్పుడు వేడి ఎక్కువై ఉడకపోయసాగింది కాబోలు. ఇదివరకు ఈ ఉడకపోతలు, వేడులు ఎక్కువికి

పోయారో ? సరేగాని, ఒంటరిగా ఎందుకువడుకుంటున్నావే మరి ?" అంది సుభద్ర.

"ఇది నీకెవరు చెప్పారు?"

"ఊళ్ళోవాళ్ళందరికీ తెలుసు. నిజంచెప్పు, నే చెప్పింది వట్టిదంటావా లేక నిజమంటావా?"

"ఊళ్ళోవాళ్ళకు నామీద ఇంతకసి దేనికి? వాళ్ళసొమ్మేం తిన్నాను నేను?"

"సరే, ఆమాటలన్నీ అలావుంచి, లాలాగారి విషయం కాస్త చెప్పు.

"ఏమన్నా వుంటేగా అసలు. చెప్పటానికి?"

"సరే; చాలరోజులయింది. ఒకనాడు చాల ప్రొద్దుపోయినతర్వాత ఏదో గల్లంతుజరిగింది. 'పహాడీ' పన్నాలాల్ నీ మిద్దెలోనే నీతోనే పట్టుబడ్డాడు. మీ పెద్దన్నయ్యగారు లాఠీతీసుకుని పరవళ్ళుతొక్కుతుంటే చౌదరిగారు సర్ది వేశారట. ఎలాగైనా ఆతనికే ఇవ్వటాన్కి నిశ్చయించుకొన్నాంగదా; అతనివెంట పంపటానికి ముందే కలియిక జరిగింది. ఇందులో నష్టమేముందిలే' అని చివరకు సంతృప్తిపడ్డారటగా. చెప్పు, నే చెప్పింది అక్షరాలా నిజమో కాదో చెప్పు"

"బొత్తిగా అబద్ధం. పదహారణాలు అబద్ధం." అంది రామా నవ్వి.

"నీ నవ్వే నే చెప్పింది నిజమని చెబుతోందిలే" అంది-చిటికవేసి సుభద్ర.

"ఎముకలెందుకు కొరుక్కుతింటావే?"

"అసలుసంగతి దాచేస్తున్నావా? సరే, చెప్పకు ఈ సాగి తిరిగివచ్చినపుడు ఈ అరుగుమీద నేకూర్చొని నీనోటితోనే అంతా చెప్పించకపోతే అప్పుడను. నాకు వినటానికి ఇష్టం లేకపోయినాసరే, అత్తగారింటి కబుర్లన్నీ చెప్పేదాక వదలిపెట్ట నంటే నమ్ము."

"నిజం చెబుతున్నా, నీవువిన్నదంతా వొట్టి అభూత కల్పనలుతప్ప ఇంకేమీ కాదు."

"ఐతే మరి నవ్వుతావెందుకు?"

"నా కలవాటు. కాకపోయినా ఏడ్వటం దేనికి?"

"ఇక్కడ గంగా దసరాపండగరోజున ఒక రాయి పెట్టి పోయావు. నీ కోరిక ఫలించింది." అంది సుభద్ర.

"ఏదీ? చూడనీ; ఇప్పుడుకూడ అక్కడే వుందో లేదో కాస్త చూడనీ." అంది రామా లేచినిలబడి.

చూస్తే ఆ ప్రదేశంలో జతను మరొక రాయి కూడ వుంది. ఆశ్చర్యంకల్గింది. ఒకవేళ సుభద్ర ఏమన్నా పెట్టిందేమో నని ఆవిణ్ణి అడిగింది. "నాకేంపని? పుట్టింటికి మళ్ళీ త్వరగా రావా లన్న మొక్కులుమినహా ఇతరగొడవలు నాకెందుకు కావలసి వచ్చాయి?" అంది సుభద్ర.

రామా నవ్వింది. తర్వాత ఇద్దరూ అక్కడనుంచి వెళ్ళి పోయారు.

# 16

కటికచీకటిరాత్రి. 'టపటప' మని వర్షం కురుస్తోంది; ఢమఢమ్మని ఉరుములు ఉరుముతున్నాయి; తళతళయని మెరుపులు మెరుస్తున్నాయి. నదులు, వాగులు, చెరువులుమున్నగు జలాశయములలోని నీళ్ళు, తుదకు చెట్లనుండిజారిపడే వాన బొట్లుసయితం ఒక అరనిమిషంమాత్రమే కన్పించి మరల నిబిడ తమోరాసిలో విలీనమైపోతున్నాయి.

అఖండ 'బేతవా'జలరాసిలోనుంచిఒకవ్యక్తి 'బరాల్'రేవులోనుండి పైకివచ్చాడు. సొరకాయబుర్రలు వొడ్డున ఒకచెట్టు మొదట్లో వుంచాడు. కళ్ళుచెదరేమెరుపుల వెలుగులో లాఠీ సహాయంతో బాదల్‌చౌధరి ఇంటికిటికీవద్దకొచ్చి చేరాడు. కిటికీ తెరచివుంది. కొంచెంసేపు నిల్చొన్నాడు. ఇవ్వాళ కుక్కల మొరుగులూలేవు; ఒకదానిమీద ఇంకొకటిపడి పోట్లాటలూ లేవు. అతను దగ్గాడు ఒకసారి మెరసింది; మళ్ళీమెరసింది. మళ్ళీమళ్ళీ మెరుస్తూనేవుంది. దారిఅంతా వెలుగుమయమైంది. ఆవ్యక్తి బలిష్టకాయంమీదపడి కారుతున్నవర్షంబిందువులు ముత్యాలసరాలులా మెరసిపోతున్నాయి. ఎవరో కిటికీలోనుంచి తొంగిచూశారు. ఆచూడటం ఆ క్రిందనున్న వ్యక్తికి గాలిపూవులు ఆకుల్లోదాచిన గులాబిపూవును ఒకక్షణం బైటికి చూపి మళ్ళీదాచివేసుకొన్నట్టుగా కన్పించింది. ఇతను దేవసింహుడు. ఆ తొంగిచూచినవ్యక్తి 'రామా.' మెరుపుల కాంతిలో ఒకరినొకరు గుర్తించుకొన్నారు.

"ఇవ్వాళ క్రిందనుంచే ఒకమాట అడిగిపోవాలని వచ్చాను. అంతకుమినహా మరే అభిలాషాలేదు. ఆతర్వాత నాకొరకు ప్రపంచంగాని, లేక ప్రపంచంకొరకు నేనుగాని వుండదు. నేను దేవసింహుణ్ణి." అన్నాడు సందులో కిటికీక్రింద నిలబడ్డవ్యక్తి నెమ్మదిగా.

వానమోతలో అతనిమాటలు పూర్తిగావినపడ్డాయో లేదో చెప్పటంకష్టం. కిటికీలోనుంచి తలకాయ బైటకుపెట్టి "ఆ, గుర్తుపట్టాను." అన్న దేదో స్త్రీకంఠం. ఈ సూక్ష్మసంగీత మయశబ్దం దేవసింహుని చెవుల్లోకెళ్ళిపడింది. ఒళ్ళుగగుర్పొడిచింది. గాలీ, వానా రెండూ ఏకమైకూడా చేయలేనిపనిని ఈ శబ్దాలు అరసెకండులో చేసిపారేశాయి.

"బహుశ నామాటలు నీకు వినిపించలేదనుకుంటా." అన్నాడు దేవసింహుడు కొంచెంబిగ్గరగా.

"వినిపించాయి, వినిపించాయి." అంది స్త్రీకంఠం. "మీరు క్రింద వానలో నిలబడి తడుస్తున్నారు. ఇక్కడికిరావటానికి ఎన్నికష్టాలు ఎదుర్కోవలసివచ్చిందో తెలియదు. నేను మాత్రం ఏమీచేయలేకపోతున్నాను" ఈమాటలు తలకాయ ఇంకాకొంచెం ముందుకువెళ్ళబెట్టి అంది.

దేవసింహుడు జవాబుగా ఏదో చెప్పాలనుకొన్నాడు. కాని నోటిలోనుంచి మాటేమీ రాలేదు గొంతునెవ్వడో గట్టిగా అదిమి పట్టుకున్నట్టు.

"నేను రామాను ఇంకెవ్వరోకాదు. భయపడాల్సిన అవసరంలేదు" అంది ఆ గొంతు మళ్ళీ కిటికీలోనుంచి.

"ఎవరంటేనూ నాకేం భయంలేదు. కేవలం నా అదృష్టానికే భయపడుతున్నా. నేను బ్రతికివుండగానే నీవు మరొకని దానవై పోనున్నావని విన్నాను."

రామా అందుకు జవాబేమీ ఇవ్వలేదు.

"ఈ సంగతే గట్టిగా తేల్చి, తెలుసుకు పోవాలని ఎన్నాళ్ళనుంచో తలక్రిందులుగా తపస్సుచేస్తున్నా; పిచ్చివాడిలా తిరుగుతున్నా, ఏదో ఒకటి ఖచ్చితంగా తేల్చి చెబితే ఆ తర్వాత నా తిప్పలేదో నేను చూచుకుంటా. ఏ దారినపోతే శ్రేయస్కరమో ఆ దారిన చప్పునపోతా." అన్నాడు దేవసింహుడు కొంచెం ఉద్రిక్తంగా.

"అలా జరగటం అసంభవం" అంది రామా.

దేవసింహుడు గద్గదుడయ్యాడు. ఏమీ మాట్లాకుండా నిశ్శబ్దంగా అలాగే వుండిపోయాడు.

"మీరు తడిసిపోయారు. కిటికీదారిన పైకిరండి. ఒక నిమిషంవుండి మళ్ళీ వెళ్ళిపోవచ్చు. అంది రామా. గొంతు వణకుతోంది. వానమోతలో గొంతుకలిసిపోయినట్టు. 'మీరు ఎక్కగలరా' అంటూ జవాబేమీ రాకుండానే మందపాటి దుప్పటొకటి తెచ్చి కిటికీలోనుంచి బైటికి వ్రేలాడ వేసింది.

దేవసింహుడు దాని సహాయంతో లోపలికి ప్రవేశించాడు.

వర్షం ఆగకుండా అలాగే కురుస్తోంది. గాలీ తగ్గలేదు. మెరుపులూ అలాగేవున్నాయి. దేవసింహుడు ఏ దారినలోపలికొచ్చాడో ఆ దారినే మెరుపుల వెల్తురూ లోనికి వస్తోంది; పోతూంది.

రామాను దేవసింహుడు క్రిందనున్నప్పుడు ఆ వెలుగులోనే చూచాడు, ఇప్పుడు పైకి వచ్చి మళ్ళీ ఆ వెలుగులోనే కంటినిండా చూచాడు. గులాబిరంగు ముఖం, కాంతిమయ పెద్ద పెద్ద కళ్ళు, సహజ మనోహర స్మితహాసం, ఉన్నత లలాటం, నల్లటి కేశపాశాలు, ముసిముసి నవ్వులు సహజ సంపదగాగల ఎర్రటిపెదవులు, అందమైన గుండ్రటిమెడ; అన్నీ అవే. వాటినే ఆ మెరుపుల వెలుగులో మరొకసారి చూచాడు. వీణానాదంవంటి కంఠం వర్షం టప్ టప్ ధ్వనిలోకూడ స్పష్టంగానే విన్నాడు. ఆ తర్వాత ఎవరి నిమిత్తం ఇన్నికష్టాలు పడ్డాడో, ఇంత కఠోర పరిశ్రమచేశాడో ఆ వ్యక్తి ఇప్పుడు ప్రత్యక్షంగా ఎదుట నిలబడివుంది. అందులోనూ ఆ చిరునవ్వు ఆ దీప్తితోనే.

కాని దేవసింహుని కాళ్ళుమాత్రం వణుకుతున్నాయి. మెరుపుల వెలుగుకూడ ఎక్కువ సహాయకారిగాలేదు. ఎంతో ప్రయత్నంమీద "ఇవ్వాళ నానిమిత్తం గొప్ప ఆపదను తలపై బెట్టుకున్నావు" అన్నాడు.

"నేనా, అలాంటిదేమీ లేదే! పైపెచ్చు నానిమిత్తం మీరే ఎన్నోకష్టాలుపడుతున్నారు." అంది రామా నెమ్మదిగా.

అటుపిమ్మట ఏంచేయాలో ఏంచెప్పాలో దేవసింహునకు తోచలేదు. దుప్పటి ఒకవైపు మంచంకోడుకు కట్టబడివుంది. రెండోవైపుకొన కిటికీగుండా క్రిందికి వ్రేలాడుతోంది. అతను ఆ వ్రేలాడేవైపుకే చూస్తున్నాడు. రామా కొంచెం ఎడంగా దృఢభావంతో నిలబడివుంది. రామా తనకంచుగొంతుతో

"కూర్చోండి. ఇలా ఎంతసేపని నిలబడివుంటారు?" అంది నెమ్మదిగా.

మంచంమీద కూర్చొని "ఇక వెళ్ళనా? మీవాళ్ళెవ రైనా మేల్కొంటే నీకేం కష్టాలొస్తాయోమరి: అన్నాడు దేవ సింహుడు.

"మేల్కొంటే నాకేం భయం. ఇందులో భయపడవల సినవిషయ మేముంది? నాదైవం నాదగ్గర కూర్చున్నారు. అందుకు నన్నొకడేం అనగలడు? ఏంచేయగలడు? మహాఅంటే పో ఇక్కడనుంచి. నీపెనిమిటివెంట వెళ్ళిపో, అంటారు. అంటే అలాగేవెళ్ళిపోతా." అంది రామా.

"మన తల్లిదండ్రులింత గ్రుడ్డిగా ఎందుకు వ్యవహరిస్తు న్నారో నాకర్థంకావటంలేదు."

ఒకనిమిషం ఆగి "నేనేమో హాయిగా మంచంమీద కూర్చున్నాను, మరి నీవేమో ఇంతసేపటినుంచి నిలువుకాళ్ళన నిలబడివున్నావు. నీవుకూడ దీనిమీదకేవచ్చి కూర్చోకూ డదా?" అన్నాడు దేవసింహుడు. ఈమాటలన్నపుడు దేవ సింహుని దేహం వణకిపోయింది.

రామా కొద్దిగా నవ్వింది, కాని దగ్గరకొచ్చి కూర్చో లేదు సరిగదా పైపెచ్చు కాళ్ళమీదపడింది.

దేవసింహుడు ఆవిణ్ణి లేపాడు. కౌగిటచేర్చుకోవాలను కున్నాడు. కాని ఆవిడ ప్రక్కకుతొలగి నిలబడింది.

"ఆ శుభఘడియ ఎన్నడొస్తుంది?" అన్నాడు దేవ సింహుడు.

"ఏమిటదికి?" అంది రామా.

"నిన్ను కౌగిటచేర్చుకొనే ఘడియ;"

అందుకు రామా జవాబేమీ ఇవ్వలేదు.

దేవసింహుడు మంచంమీదనుంచి లేచి ఆమెదగ్గరకు రాసాగాడు. "కానేపటిలో తెల్లవారనుంది. ఇంటికిచేరటానికి దారిలో ఎన్ని అవస్థలు, ఎన్ని ఇబ్బందులుపడాలో తెలియదు. మీదర్శనం లభించింది. అందువల్ల నాకు సమస్తసౌఖ్యాలు లభించినట్లుగావుంది." అంది రామా.

దేవసింహుడు ఆగిపోయాడు, "మంచిది, ఇక నేనింటికి పోతున్నా. మళ్ళీఎప్పుడైనావస్తా; కాదు రేపువస్తా" అన్నాడు. కొంచెంసేపు స్తంభించి నిలబడ్డాడు. మళ్ళీ వెంటనే వ్రేలాడుతున్న దుప్పటి పట్టుకొని కిటికీబైటకు కాలుపెట్టాడు. "ఇదిగో, ఒకమాట" అంది రామా. కాని దేవసింహు డప్పటికే క్రింది కెళ్ళిపోయాడు. క్రిందనుంచి "ఏమిటి?" అన్నాడు. "మళ్ళీఎప్పుడైనా వద్దుగాని రేపుమాత్రం రాకండి." అంది రామా. "ఎందుకని?" అని ప్రశ్నించాడు దేవసింహుడు. కాని ఈ ప్రశ్నకు జవాబేమీ అందక తనదారినతాను వెళ్ళిపోయాడు.

## 17

మర్నాడు పండగ. పన్నాలాల్‌ను ఆహ్వానించటం మొదటనే నిర్ణయించబడింది. ఆ రోజున కొంచెం ఆలస్యంగా వచ్చాడు పన్నాలాల్. ఆకాశమంతా కారుమబ్బులతో నిండి వుంది. రాత్రీ శుక్లపక్షపు రాత్రికాదు. అందుచేత బాదల్ చౌధరి ఎన్నివంకలు చూపెట్టినా తుదకు ఆరాత్రి అక్కడే మకాంపెట్టాడు పన్నాలాల్. ఇంటిలోపల ఏ గదిలోనైనా పడు

కోవాలనివుంది. వానాకాలం కావటంవల్ల మిద్దెక్రింది వరండా తేమగావుంది, పడుకొనుటకు బాగాలేదని చెప్పాడు. కాని అతనికోరిక ఈడేరలేదు. మిద్దెమీద రామా పడకగది మాత్రమే అందుకు తగివుంది. కాని అది ఖాళీచేయించబడదు. అదితప్ప మరొకగది ఖాళీగాలేదు.

"ఇవ్వాళ గాకపోతే ఇంకొకనాడేసరి. ఐనా ప్రయత్నం మట్టుకు ఇవ్వాళనేచేస్తాను." అని అనుకున్నాడు మనస్సులో పన్నాలాల్. పన్నాలాల్ ఇవ్వాళ ఇంటిలోనే వున్నాడని రామాకు తెలుసు.

అర్ధరాత్రిదాటినతర్వాత ఆ కిటికీక్రిందనే నిలబడి "నా మాట ఆనవాలు పట్టేవారెవ్వరైనా వున్నారా?" అన్నాడు దేవసింహుడు నెమ్మదిగా.

కిటికీలోనుంచి తల బైటకుపెట్టి "ఇంట్లో కొందరు మేల్కొని వున్నారు." అంది రామా నెమ్మదిగా.

"కాని నేను చాల దూరాన్నుంచివచ్చాను. నిన్ను చూచిపోదామని వచ్చాను నిన్ను చూడకుండా వెళ్ళటమెలా సంభవం? అన్నాడు దేవసింహుడు.

రామా కిటికీలోనుంచి చీర క్రిందికి వ్రేలాడవేసింది. దేవసింహుడు పైకి ఎక్కివచ్చాడు "ఇవ్వాళ మనమీద మెరుపులకన్నా కోపంగానే వున్నట్టుంది. కాస్తవెల్తురుంటే కంటి నిండా అన్నా ఒకసారి చూచిపోతా. ఎందుకంటే నీవు ఎలా గైనా దగ్గరకు రావుగదా!" అన్నాడు దేవసింహుడు నెమ్మదిగా.

"ఇంట్లో ఎవరైనా మేల్కొని వుండొచ్చు." అంది రామా.

"మరి నిన్న వాళ్ళలెక్కేమీ వున్నట్టులేదే?"

"లెక్క ఇవ్వాళాలేదు తెల్లవార్లూ ఇక్కడేవుండండి. తెల్లవారినతర్వాత అందరినీ కలుసుకొని ఇంటికి వెళ్ళండి."

దేవసింహుడు మౌనంగా వుండిపోయాడు. ఒక నిమిషం తర్వాత నిట్టూర్చి "సరే, ఆ రోజూ ఒకనాడు వస్తుందిలే" అన్నాడు.

"దేవుడికి మొక్కుచున్నాను."

"నేనూ అంతేగా"

"ఎక్కడ ?"

"ఇక్కడే, రావి చెట్టుక్రింద."

"రెండో రాయి ఎవరు పెట్టారు?"

"మొదటిరాయి ఎవరు పెట్టారు?"

"ఏమో, నాకేం తెలుసు? "

"ఎవరుపెట్టారో నేను స్వయంగాచూశాను."అన్నాడు నవ్వి దేవసింహుడు.

" మీా రెక్కడున్నారేమిటి ? " అంది ఆశ్చర్య చకితయై రామా.

"అక్కడే, దగరలోనే, ప్రక్కనే. నీ స్నేహితురాలు నిలబడి ఏదో చెబుతున్నచోటునసే." అన్నాడు దేవసింహుడు.

"అది ఏమేమో వాగింది "

తర్వాత చాలసేపు ఏవో మామూలువిషయాలు సంభాషించుకొన్నారు. అతని ప్రయాణంసంగతులు అడిగింది

రామా. ఆ సంగతులన్నీ సవిస్తరంగా వర్ణించిచెప్పాడు దేవ సింహుడు.

కొంచెంసేపు ఆశ్చర్యంలో మునిగి అలాగే నిలబడి పోయింది రామా. కళ్ళు చెమ్మగిల్లాయి; కంఠం కంపించింది. "ఇంతవాన, ఇలాంటికటికచీకటి, ఇన్నికొండలు, ఇన్నివాగులు! ఇంతపెద్ద అడవి! ఆపైన మొసళ్ళ భయమూ లేదు. తేళ్ళు పాములంటేనూ భయంలేదు. మరి నేనో? ఇక్కడ మిద్దెలో హాయిగాకూర్చొని కాలంగడుపుతున్నా."

"ఎక్కడేమిటి కూర్చున్నది? ఇంతసేపు నిలువుకాళ్ళ మీదనే నిల్చొనివున్నావుగా. ఇలా కాస్తదగ్గరకురా చెవిలో ఒకమాట చెబుతా." అన్నాడు నవ్వుతూ దేవసింహుడు.

"ఇక్కడెవరూ మనమాటలు వింటానికి కూర్చోలేదు లెండి. చెప్పండి. జాగ్రత్తగా వింటున్నాగా." అని రామా కొద్దిగా నవ్వింది.

"ఈమాట దగ్గరలోవుంటేనే చెప్పవీలవుతుంది. ఇలా దగ్గిరకురా, చెబుతా." అన్నాడు దేవసింహుడు

రామా మాట్లాడలేదు. అలా దూరంగానే నిలబడి వుంది.

"నాశ్రమకాస్త దృష్టిలోవుంచుకొని ఆలోచించు." అన్నాడు దేవసింహుడు.

రామా నవ్వి 'మంచిది' అని మాత్రమే అని వూరు కుంది.

"ఈ నవ్వుకు ఆత్మార్పణంచేస్తున్నా."

"ఏమో! ఏమంటున్నారో నాకేం తెలియటంలా."

"మంచిది, అలా దూరాన్నుంచేసరి, నే నడిగే ప్రశ్నకు సమాధానం చెప్పు."

"ఏమిటది?

"ఏమో, నా కేం తెలుసు?"

"నీవు నా కేం అవుతావు?"

"సరే, నేను నీ కేం అవుతాను?"

"ఇది మీ కే తెలియాలి."

ఒక నిమిషం ఆగి మళ్ళీ "ఐతే, దగ్గరకురాను అని ప్రతిజ్ఞ చేసి కూర్చున్నా నన్న మాటా?" అన్నాడు దేవసింహుడు.

దగ్గరే నిల్చొన్నా గా." అంది రామా నవ్వి.

"ఇంకా కాస్త దగ్గరకు."

"చాల దగ్గరలో వున్నా. 'పహాడీ' పన్నాలాల్ మీ కేలాంటి చుట్టం? అని ప్రశ్నించాడు దేవసింహుడు అకస్మాత్తుగా.

"ఏమీ కాడు. దూరపు చుట్టమేమన్నా అవుతాడేమో" అంది రామా.

"దూరపు చుట్టమా! ఐతే మరి ఇంత గాఢస్నేహసంబంధాలా? మీ ఇంటికి చాల ఎక్కువగా వస్తూ వుంటాడనుకుంటా."

ఏదో ఒకరోజు జరిగిన సంఘటన గుర్తుకు తెచ్చుకొని నవ్వి, "మీ రొకరోజున అతని ముందు 'భర్రోల్' గొడ్డు కాపరి అయ్యాముగదూ. అప్పుడే పిచ్చిలో తిరుగుతున్నా రేమిటి?" అంది రామా.

"ఇంకొక పిచ్చి నా కేం ఎక్కగలదు? అహర్నిశం ఒకే ఒక పిచ్చి. నిద్రపోయినా లేక మేల్కొనివున్నా ఆ కలలే

కంటూంటాను. మట్టిలో కలిసిపోయిన తర్వాతనూ ఆ కలల్లోనే లీనమైపోతాను" అన్నాడు దేవసింహుడు.

"మీరు విచారంగావున్నట్టు కన్పడుతారేమిటి? నావల్ల ఏమైనా తప్పు జరిగిందా? ఎంతో కష్టపడి, ఎన్నో భయంకర దారులగుండా ప్రయాణంచేసి వచ్చారు. అది చాలదన్నట్టు ఇప్పుడు నేను మిమ్మల్ని ఎంతగానో కష్టపెడుతున్నా." అంది రామా ఒకడుగు ముందుకు వేసి.

"నీవల్ల ఎప్పుడైనా తప్పు జరగగలదా? 'నాబంగారం కొరకే ఈ తిరుగుడంతా – తిరుగుతున్నాను; నా ఖజానా నిమిత్తమే ఈ ప్రయాసంతా పడుతున్నాను. దాన్ని పరాయివాళ్ళు దొంగిలించుకుపోవుటకు పొంచి కూర్చున్నారు. ఇది నాఅదృష్ట దోషం తప్ప ఇంకేమీకాదు." అన్నాడు దేవసింహుడు కరుణ స్వరంతో.

"మీరు తలక్రిందులుగా మాట్లాడుతున్నారు."

"నా మాటలు తలక్రిందులుగా – విపరీతంగా – కన్పడితే కనపడవచ్చు. కాని ఏంచెయ్యను. గొప్ప అసహాయ స్థితిలో వున్నాను." అన్నాడు దేవసింహుడు. కొంచెం ఆగి మళ్ళీ "నీవు నాదానవు, నేను నీవాడిని. ఐనా సుఖసౌఖ్యాలకు నోచుకోలేదు చివరకు తనివితీర కళ్ళతో చూచుటక్కూడ పుణ్యంచేసుకోలేదు. స్వేచ్ఛగా, తృప్తిగా నీతో మాట్లాడుటకు వీల్లేదు. దొంగలమాదిరిగా కటిక చీకటి రాత్రుల్లో వస్తున్నా. ఎవరైనా వింటారేమో నన్న భయంతో నెమ్మదిగా మాట్లాడవలసివస్తోంది. భార్యాభర్తలు మాట్లాడుకొనుటక్కూడ ఇంట్లోవాళ్ళు మేల్కొంటారేమో

నని భయమూయెె. నాసుఖాలన్నీ సర్వనాశనం చేయటానికి అటు ఏమేం కుట్రలు జరుగుతున్నాయో తెలియదు. వాటి విషయం చెప్పటం నీకేమాత్రం ఇష్టంలేదన్నట్టుగా కన్పడు తోంది.'' అన్నాడు దేవసింహుడు.

''నన్నేం చెప్పమంటావు?'' అంది రామా.

''అడిగినా నీవు చెప్పనే చెప్పటలేదుగదా!'' అన్నాడు దేవసింహుడు విహ్వలత్వంతో.

కొద్దిగాదగ్గి మెదలకుండా ఫూరుకుంది రామా.

ఇంతలో మిద్దెగదితలుపు ఎవరో నెమ్మదిగా గుద్దారు. ఇద్దరూ అటు కేసి తేరిపారచూచారు. తిరిగి రెండు మూడుసార్లు గుద్దులు వినపడ్డాయి. లోపలి గడివేసివుంది. రామా తలుపు తెరవలేదు. కొన్ని నిమిషాల తర్వాత ఎవరో తలుపు దగ్గర నుంచి వెనక్కి తిరిగిపోయినట్టుగా కన్పించింది.

రామా గభాలున వెళ్ళి దేవసింహుని కరచుకుపోయింది. దేవసింహుని కన్నీటిబొట్లు రామా చెక్కిళ్ళను తడిపివేసాయి. ''మీరు వెళ్ళిపొండి. ఏదోశంకించియే ఇవ్వాళ రావద్దని నిన్న మీకు చెప్పాను'' అంది రామా.

కొన్ని క్షణాలు ఆగి ''నాకు భగవంతునియెడ నమ్మక ముంది. అతని దయవుంటే ఒకనాడు ఆ శంకాశూన్య శుభ ఘడియకూడ వస్తుంది. నే వెళ్తున్నా. తెల్లవారవచ్చింది. మళ్ళీ త్వరలోనేవచ్చి మరి కొన్ని విషయాలు మాట్లాడుతాను'' అన్నాడు దేవసింహుడు.

కిటికీదారిన క్రిందికి దిగాడు దేవసింహుడు. క్రిందకు వ్రేలాడుతున్న వస్త్రం పైకిలాక్కున్నది రామా. పెద్ద పెద్ద

అంగలతో నదివొడ్డుకెళ్ళి పడ్డాడు దేవసింహుడు. ఆరోజున అతని మనస్సు ఇదివరకెన్నడూ లేనంత బలంగావున్నట్లు కన్పించింది.

# 18

భాద్రపదమాసపు అమావాస్య. పన్నాలాల్‌కు మళ్ళీ ఆహ్వానం వచ్చింది. ఈదఫాకూడ విందు ఏర్పాట్ల బాధ్యతంతా బేతాళీదే. బాదల్‌చౌధరి ఇష్టంలేక ఏవో కుంటిసాకులు చెప్పటమేగాని తగిన కారణాలేమీ వెల్లడించలేకుండా వున్నాడు. అందుచేత ఈసారికూడ అతని మాటలేమీ సాగలేదు. విందు చేయటానికి అంగీకారం తెల్పవలసి వచ్చింది.

పన్నాలాల్ ఇవ్వాళా ప్రొద్దుగూకకముందే చేరుకున్నాడు. పగలంతా వర్షం. ఇదికూడ అలా రావటాని కొక కారణం. కాని వర్షం లేకపోయినా ఆవేళకే చేరుకోవాలని ముందుగానే నిర్ణయించుకొన్నాడు పన్నాలాల్.

భోజనాల తర్వాత పన్నాలాల్ ఆరోజు కక్కడే ఆపు చేయబడ్డాడు. వర్షం ఎడతెగకుండా కురుస్తోంది. ఇక అసలు వెలవనే వెలవదన్నట్టు ఎటుచూచినా భూభాగమంతా నీళ్ళమయంగావుంది. ఇండ్లలోని భాగాలుకూడ ఎన్నో తడిసి బురద బురదగా అయిపోయాయి. బేతనా నదిజోరు ఇక చెప్పనే అవసరంలేదు

జాముప్రొద్దుపోయింది. పన్నాలాల్‌కు పక్కఏర్పాట్లు ఎక్కడచేయాలన్న సమస్యవచ్చింది.మిద్దెక్రిందిపోర్షను, వరండా

గది అంతా నీళ్ళునిల్చివున్నాయి. క్రింద మరికొన్ని గదులు న్నాయి. కాని అవీ తేమతేమగానే వున్నాయి. పైన మిద్దె మీద కొన్ని గదుల్లో బాదల్‌చౌధరి, అతనికొడుకులు కోడళ్ళు వున్నారు మరొకచోటు ఖాళీగాకన్పించటంలేదు. ఇక రామా గది ఒక్కటేమిగిలివుంది. అందులో ఆవిడ లోపలగొళ్ళెం పెట్టుకొని ఒంటరిగా పడుకొంటూవుంటోంది. ఒంటరిగా పడు కోవద్దని లోగడకూడ ఒకటిరెండుసార్లు చెప్పారు. కాని ఆవిడ వినినట్లులేదు కుటుంబంలో ఆవిడే కాస్త ఎక్కువమంకుపట్టు గలమనిషి. పెళ్ళిచేస్తే అదీ బాధాకరంగానే పరిణమించింది. అందుచేత ఆవిడ మంకుతనాన్ని వదలించాలని అంతగాపట్టుదల చూపినవాడెవ్వడూలేడు. కాని ఇవ్వాళ అతిథినికూడ గౌరవిం చవలసినబాధ్యత వుంది.

రామాను అక్కడ పడుకోవద్దనిచెప్పారు. తనతల్లిదం డ్రులగదిలోకెళ్ళి పడుకొనుటకంగీకరించి అక్కడికేవెళ్ళి పడు కుంది.

ఈ సంగతి పన్నాలాల్‌కు తెలిసింది. 'బేతాలీ'ని పిలిచి "ఏమిటీమర్యాదలు? నాకేంబాగుండలేదు. నా ఒక్కడికోసం ఇంట్లోవాళ్ళందరినీ ఇబ్బందిపెట్టడం ఏమంతమర్యాద? నేను మిద్దెక్రిందనే ఎక్కడో ఒకచోట పడుకుంటాలెండి. ఎక్కడ పడుకునేవారిని అక్కడనే పడుకోనివ్వండి. నేనుమాత్రం క్రింద గదుల్లోనే పడుకుంటాను. ఇందులోమరేం ఇబ్బందిలేదు!" అన్నాడు పన్నాలాల్.

ఎంతబ్రతిమాలినా పన్నాలాల్ తననిర్ణయాన్ని మార్చు కోలేదు. తుదకు ఆతని ఇష్టప్రకారమే క్రిందగదుల్లో పక్క వేయ బడింది.

రామా తన తండ్రిగారిగదిలో కెళ్ళి పడుకుంది. అందు చేత రోజూ ఆవిడపడుకునే మిద్దెమీదిగది ఖాళీగానే వుండి పోయింది. అందులో ఒకమంచం, దానిమీద ఒకదుప్పటి మాత్రమేవున్నాయి.

ఇల్లంతా నిద్రపోయింది. కాని పన్నాలాల్‌కు మాత్రం నిద్రపట్టలేదు. ఆలోచించసాగాడు. "ఆరోజు ప్రయత్నం నిష్ఫలమైపోయింది. ఎంతో నిద్రలో కలవరించుతున్నట్లుగా కన పడింది. తలుపుకొట్టిచూచా. కాని జవాబుశూన్యం. ఆరో జున నన్నుచూచి ముసిముసిగానవ్వింది. మేల్కొనివుంటే తప్పక తలుపుతీసి ఆలింగనమిచ్చివుండేది. ఆహా! ఎంత అంద మైన పిల్ల! ఎంతచక్కటి నేత్రాలు! ఆమూడుముళ్ళూ కాస్త వడిపోతేచాలు, ఆతర్వాత అంతా ఒకటేమజా, ఒకటేమజా అనుకో. సరే, ఇదిజరిగిననాడే జరుగుతుందిలే. కాని ఇవ్వాళ మాత్రం ఏదో ఒకవిధంగా తప్పక కలుసుకుతీర్తాను. ఒక వేళ ఏకారణంచేతనైనా పెళ్ళిజరగకపోయినా, లేక ఇంకే అదృష్ట వంతుడైనా తన్నుకుపోయినా కోర్కెలన్నీ అడుగంటిపోతాయి. అందువల్ల ఏదోఒక విధంగా కనీసం ఒక్కసారిఅయినా ఆలింగ నం చేసుకునేఅదృష్టం కల్గితేచాలు, జన్మతరించినట్లే. ఇక ఆ తర్వాత ఏంజరిగినా ఏంజరగకపోయినా పెద్దగావిచారంవుండదు. పెళ్ళిఅంటే గొప్పఏముందిలే, అది జరిగినాఒకటే జరగకపో యినాఒకటే. అందమైన, సువాసనగలపుష్పం ఒకసారి వాసన

చూడ్డానికి లభిస్తేచాలు. వివాహంమాత్రం ఎందుకుజరుగదు? తప్పకజరుగుతుంది. ఎక్కడికిపోతుంది? తప్పకచేజిక్కుతుంది. అది చిక్కటమేకాదు, పైపెచ్చు దానికి కొసరుగా ఒక వంద గేదెలుకూడ చేజిక్కితీరుతాయి.''

ఆలోచిస్తూ ఆలోచిస్తూ లేక ఏదో తడిమి చూస్తూ చూస్తూ తన నిర్ణీత ప్లానునేదో కార్యరూపంలో పెట్టటానికి ఉద్యుక్తుడయ్యాడు పన్నాలాల్.

ఇంటి వెలుపల భాగమంతా చీకటిమయంగా వుంది. వర్షమూ అలాగే కురుస్తోంది. తెరపిచ్చే సూచనలేమీ కన్పించటంలేదు. గాలీ జోరుగానే వీస్తోంది. పన్నాలాల్ నెమ్మదిగా మంచంమీదనుంచి లేచాడు. తన విలాస దుస్తులన్నీ వేసుకొని చక్కగా ముస్తాబయ్యాడు. చల్లగా రామా గదివేపుకు నడవసాగాడు. పల్లెటూళ్ళలో పెద్దపెద్ద ఇళ్ళుకూడ సామాన్యమైన నమూనాలోనే వుంటాయి. వాటిలో దొంగదారులేమీ వుండవు. లోపలకి వెళ్ళితే దారితప్పిపోయే ప్రమాదమూవుండదు. పన్నాలాల్‌కు ఇల్లంతా పరిచయమే; క్రిందిగదులు, మిద్దెమీది గదులసంగతి తెలుసు.

రామా గదితలుపులు మూసివున్నాయి. పన్నాలాల్ నెమ్మదిగా తలుపుమీద కొట్టాడు. జవాబుశూన్యం. మరొకసారి కాస్త విసురుగాతట్టి త్రోశాడు. ఒక తలుపుచెక్క కొంచెం వెనక్కి జరిగింది. పన్నాలాల్ సంతోషంతో తలుపు త్రోసుకొని లోపలి కడుగుపెట్టాడు. చప్పుడుగాకుండా తలుపు వేసి గొళ్ళెం పెట్టాడు.

"ఇవ్వాళేమిటో, చాల దయచూపావు" అన్నాడు నెమ్మదిగా.

జవాబుగాని, చప్పుడుగాని లేకపోవడంచూచి "ఇప్పుడిక పెద్దగా సిగ్గుపోవడం అనవసరం. నీ కొరకు ఎన్నిరోజుల నుంచి తహతహలాడిపోతున్నానో చెప్పలేను." అన్నాడు.

ఈమాటలకూ జవాబులేదు. అప్పుడు చీకట్లో తడుముకుంటూ పోయి మంచందగ్గరకుచేరి దానిమీద కూర్చోబడ్డాడు.

నవ్వి "నీవు ఎగతాళులు, వేళాకోళాలలోకూడ బాగా ఆరితేరినదానివని నా కిదివరకే తెలుసు. అందుచేత నీ మనోజ్ఞరూపం సర్వదా హృదయంలో విరాజిల్లుతోంటుంది. ఎంత బాగా సరసమాడావంటేనూ; భలే, వొట్టి మంచమేమో నా కొరకు వదలిపెట్టి తమరేమో చల్లగా మూలకుచేరి విరాజిల్లుతున్నారన్నమాట. మంచంమీద పక్కకూడా మాయంచేశారేమిటి ? ఎందుకొచ్చిన ఆలస్యంగాని, వెంటనే ఇక్కడికి దయచేయండి. లేకపోతే చేతులుచాపి తడిమి పట్టుకోవలసివస్తుంది." అన్నాడు. మళ్ళీ నవ్వి "గంగతోడు; అబ్బ! ఎంతో విసిగిపోయాను. మూలనుముడుచుకుపోయి మరింత విసిగించకు. అంత దూరాన్నుండి ఇక్కడి కిన్నిసార్లు రావడం నీకోసమే. కుక్కలు సయితం పడుకొనుటకు ఇచ్చగించని మిద్దెక్రిందిగదిలో ఇప్పటిదాకా పడివున్నా దీనికోసమే ననుకో." అన్నాడు. ఒక నిమిషం ఆగి మళ్ళీ "భయపడవలసిన అగత్యమేమీలేదు. ఇంట్లో వాళ్ళెవరూ మేల్కొనిలేరులే. వానదేవుడూ మనకు తోడుగానే వున్నాడు. ఆ మోతలో మాట లెవరికీ వినిపించవులే." అన్నాడు.

దీనికికూడ జవాబుగాని లేక చప్పుడుగాని కాలేదు. అప్పుడతనికి కొద్దిగా సందేహం కల్గింది. ఆలోచించసాగాడు— "రామాగనక ఈ గదిలో నేవుంటే ఇంత సేపు ఎందుకు ఎదురు చూస్తూ కూర్చొబెడుతుంది? ఆనాటిరాత్రి ఎన్నిసార్లు తలుపు తట్టినా ఏవిధంగా తలుపు తెరవలేదో అదేవిధంగా ఇప్పుడూ తలుపు తెరచేదికాదు. నిద్రపోతూవుండేది ఒకవేళ మోజుకలిగి వుంటే ఇంతసేపు కొయ్యస్తంభంలా నోరూ వాయి లేకుండా ఎందుకుకూర్చుంటుంది? హఠాత్తుగాసంకోచ అభిమానాలేమైనా కలిగి మూలకుచేరి ముడుచుకుకూర్చున్నదేమో. ఐతే కాస్త శ్రమతీసుకొని వెదకిచూడటం మంచిది."

పన్నాలాల్ లేచాడు. మూలమూలా గాలించి చూచాడు. మిద్దె పెద్దదికాదు. అందుచేత వెదకటానికి ఎంతో సేపు పట్టలా. వెదకివెదకి అలసి మళ్ళీ మంచంమీదకొచ్చి కూర్చున్నాడు. నిరాశమాత్రం చెందలేదు. "ఏదో ఒక వుపాయంతో రామాను ఇక్కడికి తప్పక రప్పించితీరాలి." అని అనుకున్నాడు. కాని ఆ ఉపాయమేమిటా యని ఎంతోసేపు ఆలోచించాడు. కాని ఎంతసేపు తన్నుకులాడినా బుర్రకు తట్టలా.

ఇంతలో కిటికీ క్రిందనుంచి, "నామాట గుర్తించేవారెవ్వరైనా వున్నారా?" అని ప్రశ్నించాడెవరో.

# 19

ప్రశ్నించినవాడు దేవసింహుడు. పెద్దగా పరిచయం లేనందువల్ల పన్నాలాల్ అతన్ని గుర్తించ లేకపోయాడు.

ప్రశ్న చెవినిపడగానే ఒళ్ళు జలదరించింది. దేహంలో ఒకరకమైన వణుకు పుట్టుకొచ్చింది. తలుపుతీసుకొని పారిపోవాలని అనుకున్నాడు. కాని సమయం, ప్రదేశం, ఆ ఆకస్మిక ప్రశ్న ఇవన్నీ కలిసి అతని హృదయాన్ని సంభ్రమాశ్చర్యాలలో ముంచి వేశాయి.

"ఎవరు ? ఎందుకొచ్చాడు ? ఎవరికోసం వచ్చాడు ?" అని ఆలోచిస్తున్నాడు పన్నాలాల్. దేవసింహుడు మళ్ళీ నెమ్మదిగా "ప్రియరామా ! నిద్రపోతున్నావా ? నేనిక్కడ వర్షంలో తడిసిపోతున్నా" అన్నాడు.

పన్నాలాల్ అయోమయంలోనుంచి కొద్దిగా బైట పడ్డాడు. "ఓహో, ఇతనెవడో రామాను ఏకాంతంగా కలుసుకుపోయే మనిషిలా కన్పడుతున్నాడు. అసలు విషయమేమిటో చూద్దాం. ఈ అమ్మాయి ఆటేచూస్తే ఏదో పెద్దపిచ్చిపిల్లలా వుందే."

కిటికీదగ్గరకుపోయి గొంతుమార్చి నెమ్మదిగా "ఇంట్లో మేల్కొని వున్నారు. "అన్నాడు.

వాన, గాలి మోతలో మాటలేమీ వినపడటంలేదు. దుప్పటివేస్తే పైకి వస్తా. "అన్నాడు దేవసింహుడు.

"మంచిది. పైకిరానియ్యి. పట్టుకొని నలగగొడ్తా. గల్లంతుచేసి పట్టిస్తా. రామా నాముందేమో బెట్టుపతి

పోతోంది; నేనంటే దూరదూరంగా పోతోంది ఇతనుపట్టుబడితే అప్పు డవన్నీపోయి తేలికగా చేజిక్కుతుంది. చౌధరపద్దో గొప్ప పరువుప్రతిష్ఠలుగలవాడుగా నటిస్తున్నాడు. నాతో మాట్లాడటమే గగనంగావుంది. ఇక అతనుకూడ రేపే ఈ చపలచిత్తురాలిని నావెంట పంపివేయటానికి సంసిద్ధుడవుతాడు, లేకపోతేనా, తుదకు కులంలో తన కుష్టువెధవకూడా కూతుర్ని చేసుకోటానికి అంగీకరించనంతటి చెడుపేరు వస్తుంది. నాదగ్గర ఆసంగతి తెస్తే బెట్టుచేస్తా. మొదట్లో వద్దువద్దనిఅంటూ, తర్వాత బ్రతిమాలగా బ్రతిమాలగా, అప్పుడు సరేనంటూ. కూతురితోపాటు వందగేదెలుకూడా తోలిపెట్టితీర్తాడు. భలే, చాలమంచిపని జరిగింది. ఇటువంటి సదవకాశాన్ని చేజారిపోనివ్వగూడదు. ఒకేదెబ్బకు రెండుపిట్టలుపడే అవకాశమిది. ఈ దెబ్బతో బాదల్‌చౌధరి, రామా, గేదెలు అన్నీ కైవశమవుతాయి. సంవత్సరాల్లో జరగనిపని ఘడియల్లో జరిగిపోయే అవకాశం చిక్కింది.” అని ఆలోచించాడు పన్నాలాల్.

“దుప్పటిలేకపోతే త్రాడన్నా క్రిందికివేయి.” అన్నాడు దేవసింహుడు.

ఇంతలో ఎవరో గదితలుపు గట్టిగాకొట్టినట్లు చప్పుడు అయింది. లోపల గొళ్ళెంవేసివుంది. అందువల్ల తలుపురాలేదు. సరిగ్గా అదేసమయంలో దుప్పటి క్రిందికి వ్రేలాడవేశాడు పన్నాలాల్. దుప్పటికొంగు ఒకటి గట్టిగాపట్టుకుని దేవసింహుడు వెంటనే పైకెక్కివచ్చాడు.

దేవసింహుడు ఎక్కిన చప్పుడయింది. ఇటు కాళ్ళ మట్టెల, కడియాలమోత తలుపుదగ్గరగా వినపడింది. పన్నా

లాల్ ఇదీవిన్నాడు, వెంటనే "అయ్యయ్యో, ఈదుర్మార్గుడు వచ్చినవేళ ఎలాంటిదున్ముహూర్తమంటేనూ; రామా బహుశా నాకోసమే వచ్చివుంటుంది. కాదు కాదు, నాకోసంకాదు. ఇతని కోరకేవచ్చివుంటుంది మొదట నిర్ణయించుకున్న ప్లైంప్రకారమే వచ్చివుంటుంది. సరే, ఇద్దరి వేషాలూ ఇప్పుడే కనిపెడ్తాను" అని అనుకొన్నాడు.

తలుపుదగ్గరకొచ్చిన మనిషి నిజంగా రామాయే. మిద్దె మీద పడుకోటానికి పన్నాలాల్ ఒప్పుకోలేదని ఆవిడకు తెలిసింది. తన గదిలోకేపోయి పడుకుందామని ఆలోచిస్తూ ఆలోచిస్తూ తండ్రి గదిలోనే నిద్రపోయింది. ఇప్పుడు మెలకువ వచ్చింది. దేవసింహుడెక్కడైనా వచ్చాడేమో, వస్తే నేను లేకపోవటంచూచి తిరిగిపోతాడేమోనని వెంటనే ప్రక్కతో సహా తన గదికి బయలుదేరింది. తాను తండ్రి గదిలో పడుకోటానికి వెళ్ళేటప్పుడు తలుపులు దగ్గరకువేసి పోయింది. కాని ఇప్పుడు ఎంత తట్టినా, ఎంత తోసినా తలుపులురాలేదు. పైగా ఏవోకొన్ని మాటలుకూడ వినవచ్చాయి. దాంతో తటాలున ఆగిపోయింది.

దేవసింహుడు లోనికివచ్చాడు. "ఇవ్వాళ చాల శ్రమ పెట్టాననుకుంటూ నిద్రపోయావా ఏమిటి?" అన్నాడు.

రామా గది బైటనుంచి ఈమాటలు విని భయపడిపోయింది. పన్నాలాల్‌గాని లేక మరొకరుగాని లోపల తప్పక వున్నారు. ఐతే ఇప్పుడు కర్తవ్యమేమిటి? ఎంతో వ్యాకులపడుతూ "అయ్యో! నాప్రియునకేమి జరగనున్నదోగదా! ఏం చెయ్యను?" అని ఆలోచించి చేతిలోవున్న పక్కగుడ్డలు

గట్టిగా నేలకేసికొట్టింది. బహుశా దేవసింహుని జాగ్రత్తపడమని అలాచేసివుండొచ్చు. మళ్ళీ చప్పుడయ్యేటట్లుగా పాదాలు నేలకేసికొట్టింది. కాళ్ళ అందెలు గళగళమని స్పష్టంగా మ్రోగాయి.

"గదిబైటవున్న మనిషి తప్పక ఆవిడే. ఏం సైగలు చేస్తున్నదంటేనూ! సరే, అన్నీ ఇప్పుడే తెలిసివస్తాయిలే." అని మనస్సులో అనుకొన్నాడు.

కాళ్ళ అందెలధ్వని గది బైటనుంచి వచ్చిందని దేవసింహుడు గ్రహించలా.

"ఇవ్వాళ మాట్లాడేది నీవా లేక కాళ్ళఅందెలా? సరే, ఇందుకైనా సంతోషమే.

దీనిమీదట రామా పెద్దగా ధ్వనించేటట్లుగా శ్వాస వదలింది.

దేవసింహుడు ఈ నిట్టూర్పును విన్నాడు అది అతనికెంతో బాధ కలిగించింది. "నా మూలకంగా నీకేమైనా ఆపద వాటిల్లిందా?" అని ప్రశ్నించాడు.

"ఔనండి" అన్నాడు పన్నాలాల్ కీచు గొంతుకతో. మళ్ళీ అదే గొంతులో "బద్మాష్! దొంగ వెధవా! రాడీగాడిదా! ఏంపనిరా ఇది? మర్యాదస్తుల ఆడపడచులకోసం అర్ధరాత్రివేళ బయలుదేరావా?" అంటూ గభాలునపోయి దేవసింహునిమీద పడ్డాడు పన్నాలాల్.

దేవసింహుడు భయం, ఆశ్చర్యం, ఆకస్మిక నూతన పరిస్థితులకారణంగా కొంచెం గాబరాచెందాడు. దేహదారుఢ్యంలో పన్నాలాల్‌కుమించినచెయ్యే. ఐనా లొంగిపోయాడు.

మొదటిదాడిలో తేలికగా విజయంకల్గటంవల్ల హర్షోన్మత్తుడై "రండి, రండి, పరుగెత్తుకురండి, దొంగలు, దొంగలు, చప్పున రండి." అని కేకలుపెట్టసాగాడు పన్నాలాల్.

పన్నాలాల్ ఒకవేపున కేకలుపెడ్తూవున్నాడు. అటు రెండోవేపున దేవసింహునిమీదపడి తొక్కుతూనూవున్నాడు. అర్థంకానిపరిస్థితి. ధైర్యంలేని కారణంగా కొంచెంసేపు అలాగే కింద పడివున్నాడు. కాని పరిస్థితి శ్రుతిమించి రాగానపడుతున్న దని గ్రహించిన వెంటనే మళ్ళీ ధైర్యోత్సాహాలు తెచ్చుకో సాగాడు. అరనిమిషంలో పరాజితుడు విజేత కాబోతున్నాడని గ్రహించాడు పన్నాలాల్.

కేకలుపెట్టడంలో రవ్వంతకూడ కొరతచేయలేదు పన్నాలాల్.

ఇంట్లో నిద్రపోతున్న వాళ్ళందరూ మేల్కొన్నారు. బాదల్, అతనికొడుకులు యావన్మందీ లాఠీలు, బడితలు తీసు కొని మిద్దెమీదికి పరుగెత్తుకొచ్చారు. తలుపులు లోపలగడియ వేసివున్నాయి. లాఠీలుపెట్టి తలుపులు బద్దలుకొట్టసాగారు.

పన్నాలాల్ బిగ్గరగా "దొంగ కిటికీగుండా పైకి వచ్చాడు. మళ్ళీ అటుగుండానే బైటికిపోకుండా చూడాలి." అన్నాడు. తర్వాత దొంగను నోటికొచ్చినట్లుగా బూతులు తిట్టసాగాడు.

కొందరు తలుపుదగ్గర కాచారు. మరికొందరు బేతాలీతో కలిసి కిందకుపోయి కిటికీదగ్గర కాచారు. చూస్తే దుప్పటి కిందికి వ్రేలాడుతోంది. "నాన్నా! అదిగో, అటుచూడు; బాగా కళ్ళుతెరచిచూడు. నేనన్నంతపనీ జరిగింది కదూ! నెత్తిన నోరు

పెట్టుకొని ఏన్నోరోజులనుంచీ వాగుతున్నా, జాగ్రత్త పడమని పసిపిల్లడికి చెప్పినట్టుగా చెబుతున్నా. కాని నామాట రవ్వంత కూడ ఆలకించిలపాపాన పోలేదు. ఇప్పుడు మన అందరి పరువూ పోయింది. ఆ 'పహాడీ' ఆయన్ని చూడండి. ప్రాణం అరచేతిలో పెట్టుకొని మనగౌరవం నిల్పుటకై ఎలాఅవస్థలుపడుతున్నాడో చూడండి." భేతాలీ తండ్రినుద్దేశించి.

బాదల్ లాఠీమీాద ముఖంపెట్టి మెదలకుండా వింటూ నిలబడ్డాడు. బేతాలీ మళ్ళీ "ఇదిగో మా అన్నదమ్ములమిద్దరం ఇక్కడ వున్నాంలే. మేముండగా తప్పించుకుపోవటం ఎవడి తరమూ కాదు. కాన మీారు పైకివెళ్ళి గొడ్డళ్ళతో గది తలుపులు పగలగొట్టించేపని చూడండి. అన్నాడు.

"ఎందుకలా గొంతంతా చించుకుంటూ మాట్లాడుతావు. ఇలా అరచి నీ గౌరవం నీవే పోగొట్టుకుంటున్నావు. అందరినీ నగుబాటుపాలుచేస్తున్నావు." అన్నాడు బాదల్. "ఆఁ, అలాగా! ఐతే మేమే వంశానికి అపకీర్తి తెచ్చేవాళ్ళమన్నమాట. ఇవ్వాళకేదో రకంగా ఈ గొడవనుంచి బైటపడితే రేపు బేతవాలో పడిచావటమో లేక ఇంకేదైనాచేయటమో జరుగుతుంది. కాని మీాకొక దణ్ణం. ఇప్పుడు వెంటనే పైకిపోయి ముందు ఆ గదితలుపులు పగలగొట్టించే ఏర్పాట్లు చేయండి." అన్నాడు బేతాలీ. తర్వాత వెంటనే పన్నాలాల్ పేరెత్తి "షెభాష్ మిత్రుడా, దొంగ పారిపోతాడేమో జాగ్రత్తగా వుండండి." అన్నాడు.

"మరేం ఫర్వాలేదు. అలాంటిభయం మీాకేం అవసరం లేదు." అన్నాడు పన్నాలాల్ పైనుంచి.

# 20

తనసొంత అత్తవారింటిలో తనభార్యతోనే కలుసుకో వచ్చినవాడు ఒకపరాయివాడిచేత దెబ్బలుతినటమా! అందు లోనూ పన్నాలాల్ చేతనా? దేవసింహునికి కోల్పోయిన ధైర్యసాహసాలు మళ్ళీకొద్దిసేపటిలోనే తిరిగివచ్చాయి. ఇంత వరకు వజ్రాయుధంలా కనపడిన పన్నాలాల్ బాహువులు ఒక నిమిషంలో ఎండిపోయిన సన్నటితీగెలలా కనిపించాయి. దేవ సింహుడు సత్తువకొద్దీ పైనున్న పన్నాలాల్‌ను లేపి విసరి అవ తల పారేసి పైకెక్కికూర్చున్నాడు. అణగారివున్న క్రోధం ప్రళయకాలరుద్రుని రూపందాల్చింది. తర్వాత ఇకపన్నాలాల్ స్థితి వర్ణించతరంకాదు. నజ్జునజ్జుగా దెబ్బలుతిన్నాడు. చివరకు స్పృహలేకుండా పడిపోయాడు. రంగురంగుల బట్టలన్నీ తుం పులు తుంపులుగా చిరిగి ఎందుకూ పనికిరాకుండా పోయాయి.

ఇంతలో గదితలుపులు బ్రద్దలుకొట్టే కార్యక్రమం ప్రారంభమైంది.

సగంచచ్చిపడివున్న పన్నాలాల్ మీాదనుంచి లేచి రొప్పు కుంటూ "నేనేమీాదెబ్బలాడటంలేదు. అనవసరంగా తలుపులు బ్రద్దలుకొట్టించకండి." అన్నాడు దేవసింహుడు.

"ఔను, నిజమే, అలాగే ఉడాయించుకుపోవుటకు వీలు గావుండవద్దుమరి. సరే ఎంతోసేపా! ఏంజరుగుతుందో, ఎలాంటి మరమ్మత్తు జరుగుతుందో ఇప్పుడే తెలుస్తుందిగా." అన్నాడు బేతాలీ ఉద్రేకంతో.

కిటికీక్రిందనుంచి "అసలీ పన్నాలాల్ మిద్దెమీదికెందుకెళ్ళాడు?" అని ప్రశ్నించాడు బాదల్.

"ఆఁ, ఎందుకా! ఇతడేమో మన పరువుమర్యాదలు మట్టిలోకలపడానికినీ, మరి ఆదొంగవెధవేమో నిలబెట్టటానికినీ వెళ్ళారునాన్నా! ముసలితనంలో నీమతిఅంతా ఏమైపోయిందో నాకర్థంకావడంలేదు." అంటూ మళ్ళీ "పన్నాలాల్‌గారూ!" అనిపించాడు.

కాని జవాబేమీ రాలేదు.

బేతాలీ ఆగ్రహావేశాలతో "దొంగఏదో ఆయనగారిని క్రిందపడగొట్టివేసినట్టుగా కనపడుతోంది. ఆలస్యంచేయకండి. వెంటనే తలుపులు బ్రద్దలుకొట్టిపారవేయండి." అన్నాడు.

ఇరుగుపొరుగువాళ్ళంతా లేచారు. కత్తులు కటారులు, లాఠీలు, బల్లెములు తీసుకొని కిటికీదగ్గరకొచ్చి ప్రోగయ్యారు.

ఊళ్ళో కుక్కలన్నీ అక్కడికేవచ్చి మొరగసాగాయి. చూస్తూ చూస్తూనే గల్లంతు అంతులేకుండా పెరిగిపోయింది. బాదల్ ఒక్కడు మాత్రమే నిశ్శబ్దంగా వున్నాడు.

తలువులు బ్రద్దలుకొట్టాలన్న ప్రతిపాదనను తిరిగి ప్రతిపాదించాడు బేతాలీ. బాదల్ అందుకు సంసిద్ధుడై ముందుకు రాకుండటంచూచి గొడ్డలి తీసుకొని బేతాలీ స్వయంగామిద్దెమీదికి బయలుదేరాడు. అప్పుడు బాదల్‌కూడా వెంటవెళ్ళాడు. కిటికీ క్రిందచేరిన జనం ఇటూ అటూ పరుగులు ఉరుకులుతీయ ప్రారంభించారు. చీకటి, వానా కలిసి ఆ గల్లంతును మరింత గల్లంతు చేశాయి.

బేతాలీ వెళ్ళివెళ్ళటంతోనే గొడ్డలిపెట్టి తలుపుమీద గట్టిగా కొట్టాడు. దేవసింహుడు లోపలినుంచి బిగ్గరగా "పిచ్చెమన్నా ఎక్కిందా ఏమిటి? ఎందుకలా తలుపులు బ్రద్దలు కొట్టుకుంటారు? కాస్త మెదడునుపయోగించి ఆలోచించండి. నేను గొళ్ళెం తీస్తున్నాలే తలుపులు బ్రద్దలు కొట్టకండి" అన్నాడు.

"తలుపులూ బ్రద్దలు గొడ్తాను, తర్వాత నీతలా బ్రద్దలు గొడ్తాను. అన్నాడు బేతాలీ.

బాదల్ చంగున బేతాలీ వద్దకుపోయి కంపిస్తున్న కంఠంతో "బైటగొళ్ళెం తగిలించు. దీపం వెలిగించుకురానీ. తర్వాత నీ కిష్టమొచ్చినట్లుగా చేద్దువుగాని. లేకపోతే ఈ గ్రుడ్డితనానికి చీకటి మరికాస్త తోడ్పడుతుంది." అన్నాడు.

ఇరుగు పొరుగు వాళ్ళంతా తొందర పడుతున్నారు. ఏదో ఒకటి చేసిపారవేయాలని ఆతురత చూపుతున్నారు. ఇదంతాచూస్తుంటే బాదల్ కేమీ పాలుపోవటంలేదు ఇంటి లోని స్త్రీలంతా భయభీతులై గదుల తలుపులు బిడాయించుకొని ప్రాణాలు బిగనట్టుకు కూర్చున్నారు.

దీపం వెలిగించాలన్నమాట బేతాలీ ఖాతరుచేయలేదు గాని బైటగొళ్ళెంమాత్రం తగిలించాడు.

"మీఇష్టప్రకారమే చేయండి." అన్నాడు బేతాలీ తండ్రితో.

అటు బాదల్ దీపం వెలిగిస్తున్నాడు. ఇటు బేతాలీ గొడ్డలి తిరగేసి తలుమీద కొడుతున్నాడు. అది తలుపులు

బ్రద్దలుకొట్టుటకో లేక మరింత గల్లంతుచేయుటకో ఎవ్వడికీ తెలియదు.

దేవసింహుడు దెబ్బ దెబ్బకు లోపలనుండి 'వద్దు వద్దు' వూరుకోండి వూరుకోండని వారిస్తున్నాడు. తన పేరు మాత్రం చెప్పటంలేదు. ఇంతలో బాదల్ దీపం వెలిగించి తీసుకొచ్చాడు.

"మాటఏమైనా వినటంవుందా? వూరికే తలుపులన్నీ బ్రద్దలుకొట్టడమేనా? తాతముత్తాలు కట్టించిపోయిన ఇళ్ళు.

"తాతముత్తాల పరువుప్రతిష్టలకంటె వారు కట్టించిన ఇల్లూ, తలుపులే ఎక్కువ ప్రియములులెండి." అన్నాడు బేతాలీ!

తలుపుల సందుల్లోంచి దీపం వెలుగుచూచి లోపలి గొళ్ళెం తీశాడు దేవసింహుడు. బాదల్ తన క్రుద్ధపుత్రుని ఒక వేపుకు పడత్రోసి ముందుకువెళ్ళి బైటగొళ్ళెంతీసి తలుపు తెరచాడు.

రొమ్ముకు చేతులుచేర్చి, కనుబొమ్మలు పైకిలేపి ఎదుట నిల్చొనివున్నాడు దేవసింహుడు. తలుపుప్రక్కనవున్న గూటిలో దీపంఉంచాడు బాదల్‌చౌధరి తర్వాత గభాలున దేవసింహుని ఎదుటకొచ్చి నిలబడ్డాడు. లేకపోతే బేతాలీ గొడ్డలి దేవసింహుని తలమీద పడిపోయివుండేది.

అతని సంసిద్ధతగ్రహించి "కళ్ళేమన్నా కనపడుతున్నాయా లేదా? ఎవరో కన్పించడంలేదా?" అన్నాడు బాదల్‌చౌధరి.

బేతాలీ అటుచూచి స్తంభించిపోయాడు. గొడ్డలి చేతి లోనుంచి దానంతటదే కిందికి జారుతుంది.

పన్నాలాల తేరుకున్నాడు. అతనూ దేవసింహుని గుర్తించాడు. మూల్గుతూ "పట్టుకోండివీణ్ణి. వీడు 'బ్రోల్' గొడ్ల కాపరి. నేను వీణ్ణి ఎరుగుదును. బద్మాష్, ఆరోజున పెద్ద అమాయకుడులా కన్పించాడు." అన్నాడు.

"నోరుముయ్యి నీచుడా; క్రిందమంచంవదలి పైకి ఎందు కొచ్చావోయ్." అన్నాడు బాదల్.

పన్నాలాల్ ఆశ్చర్యంలో మునిగిపోయి ఒంటినొప్పు లన్నీ మరచిపోయాడు.

బేతాలీ వెనక్కి తిరిగి "ఏమిటీ అనర్థం? పరువుమర్యాదలు లుగలవాళ్ళపిల్లలుచేసే పనులు ఇవా" పాపమంటే మేం పంప మన్నామా? ఏమనుకుంటే ఏంలాభం? ఇంతకూ మనబంగారం మంచిదైతే కంసాలివాడేంచేస్తాడు?" అన్నాడు.

పన్నాలాల్ విస్మయంతో "ఇతనెవరేమిటి?" అని అడి గాడు నెమ్మదిగా.

"మా అల్లుడుగారు. 'బజటా' మహతోగారి కుమా రుడు" అన్నాడు బాదల్ గద్గదకంఠంతో, కాని కర్క శంగా.

ఇంతలో లోపలనుంచి "రామా కన్పించటంలేదు. ఎక్కడికిపోయిందో అంతు తెలియటంలేదు." అని కేకలు విని పించాయి.

"అది నాగదిలో నిద్రపోతోందిగా" అన్నాడు బాదల్.

"అక్కడా చూశాం. కాని లేదు." అన్నారెవరో లోపలనుంచి.

"నేవెళ్ళి ఎక్కడికి పోయిందో చూస్తానుండండి" అన్నాడు బేతా లీ.

"నేవెళ్ళి వెదకనా?" అని అడిగాడు దేవసింహుడు నెమ్మదిగా.

"వద్దొద్దు మీరిక్కడేవుండండి" అన్నాడు బాదల్.

"ఎక్కడన్నా 'బేతవా'లో పడిపోయిందేమో నని నాకు భయంగావుంది. ఎందుకంటే నా ప్రాణాలొకనాడు 'బేతవా'లోనే తప్పక పోతాయని ఒకసారి అంది." అన్నదెవరో స్త్రీ లోపలినుంచి ఏడుస్తూ.

బేతాలీ నలుదిక్కులకూ కొంతమందిని పంపి స్వయంగా తానూ బయలుదేరాడు. దారిలో కనపడినవారినందరినీ అడుగుతూ, ఏమిటేమిటని అడిగినవారికి జవాబు చెబుతూ – ఏటి వైపుకుపోయాడు.

"దయవుంచి నన్ను వెళ్ళనివ్వండి. ఈనదిని గురించి నాకంటే ఎక్కువ తెలిసినవారెవ్వరూ ఇక్కడలేరు" అన్నాడు దేవసింహుడు.

"ఇక మిమ్మల్నికూడ చేతులారా పోగొట్టుకోమంటారా?" అన్నాడు బాదల్ గద్గదకంఠంతో.

సంకోచనిషిద్ధాలలో ఏదికారణమో తెలియదుగాని మొత్తంమీద దేవసింహుడు వెళ్ళకుండా ఆగిపోయాడు.

గది తలుపులదగ్గరనుంచి మిద్దెమెట్లమీదికి వచ్చేటప్పటికి ఉరుములు ఉరిమినట్టుగా, పిడుగుపడ్డట్టుగా కన్పించింది బాదల్ చౌధరికి. నది ప్రచండతవైపుకు అతనిదృష్టిపోయింది అటు ఆకాశాన్నంటే తరంగాలు; భయంగొల్పే ఉరవడి, ఇటు నుకు

మార, దుర్బల దేహం! దేవసింహునికి తన దేహంలో విద్యుత్ ప్రసారం జరిగినట్లుగా కన్పించింది.

కాళ్ళకు మెట్లతో పరిచయంలేదు. ఒక మెట్టుమీద నుంచి కాలుజారిందిం. ధామ్మని కిందికొచ్చిపడ్డాడు దేవసింహుడు – దెబ్బతిన్నా వెంటనే లేచి నిలబడ్డాడు. కాని మళ్ళీ తూలిపడిపోయాడు.

బాదల్ పరుగెత్తుకొచ్చాడు. ఇంకా చాలమంది వచ్చి చేరారు. గొప్ప గందరగోళంగావుంది. బాదల్ వెంటనే దేవ సింహుని లేవదీసి మంచిచోట పడుకోబెట్టాడు.

దేవసింహునకు స్పృహరావడమైతే వెంటనే వచ్చింది గాని, ఏంచెయ్యటానికీ వీలులేకుండావున్నందున ఉండుండి ఎంతో బాధపడిపోతున్నాడు. ఆపైన దెబ్బ ఎక్కడతగిలింది ? ప్రమాదకరమైన దెబ్బకాదుగదా!" మున్నగు ప్రశ్నలకు జవాబు చెప్పలేక ప్రాణం విసిగిపోతోంది.

ఈ అనంతప్రశ్నలతో విసిగిపోయి "పెద్ద ప్రమాదకర మైన దెబ్బఏమీకాదు. ఏదో మామూలుగాతగిలింది. మరేం ఫర్వాలేదు. నేను బాగానేవున్నాను, గాని మీరుమాత్రం గోలచేయకండి." అన్నాడు దేవసింహుడు.

సేవాశుశ్రూషలు చేస్తున్నవారిదగ్గర దేవసింహునివదలి పన్నాలాల్ మూలుగుతూపడివున్న గదిలోకివెళ్ళాడు బాదల్. అతనినుద్దేశించి "ఓరీ నీచుడా! ఓరి సిగ్గులేనివెధవా ! రెండు తన్నులు నిన్నుకూడ నాకుకూడా తన్నాలనిపిస్తోందిరా పోపో నీచుడా, ఇక్కడనుంచి" అన్నాడు.

ఎంతో కష్టంమీద చినిగి చెల్లాచెదరై పోయిన తనతల పాగను పోగుచేసుకొని ముక్కుతూ మూల్గుతూ కిందికి దిగి వచ్చాడు పన్నాలాల్ కాని నడవలేక పోయాడు. తనకోసం రాత్రివేసిన మంచంమీదకెళ్ళి పడ్డాడు. రామా పోయిందన్న దానికన్న తన గుడ్డలు చినిగిపోయినందుకు ఎక్కువ విచారంగా వుందని స్పష్టంగా చెప్పవచ్చు. ఒంటి నొప్పులు దానికితోడై మరింత బాధపెడుతూ వుండొచ్చు.

పన్నాలాల్ కిందికిచేరగానే తక్షణం 'పహాడీ'ని పంపించి వేయాలని ఆలోచించాడు బాదల్. కాని అతని మూల్గులు, పైన కుంభవర్షంచూచి తన నిర్ణయాన్ని మార్చుకొన్నాడు. తెల్లవారగానే తొలగించి వేయాలని మళ్ళీ ఆలోచించి వూరు కున్నాడు.

తెల్లవారకముందే పన్నాలాల్ మళ్ళీ ఎవ్వరికీ ముఖం చూపించకుండా అలాగే మూల్గుతూ ముక్కుతూ తన వూరు బయలుదేరి పోయాడు. బద్దలు బద్దలుగా చినిగి. నిండా మట్టి కొట్టుకొనివున్న తలపాగను మడచి చంకలో పెట్టుకున్నాడు. తెల్లటిచొక్కా, కట్టుధోవతికూడ తుక్కు తుక్కుఅయి వున్నాయి. అవన్నీ దారిలో వాగులో ఉతుక్కొని తెల్లగా చేసుకున్నాడు. కాని దెబ్బలబాధ; ఒళ్ళంతా విరగదీసినట్టుగా వుంది. ఆ షోకుదుస్తుల్లో ఇప్పుడా షోకులేదు

# 21

"ఏమిటి కర్తవ్యం? ఏం జరుగుతుంది?" అని పరిపరివిధాలుగా ఆలోచించింది రామా. కాని ఎంత ఆలోచించినా దారి తెన్నూ కన్పించటంలేదు. అప్పుడు ఏదో ఆలోచించి గబగబా ఏటివేపుకు సాగిపోయింది.

క్రింద 'బేతవా' నది బ్రహ్మాండంగా మోతలు పెడుతూ పరుగెత్తుతోంది. పైన భోరునవర్షం కురుస్తోంది. వీటికి వాయుదేవుడుకూడ తోడైవున్నాడు. 'రామా ఎక్కడికిపోయింది, రామా ఎక్కడికిపోయింది' అన్న కేకలతో ఊరంతా మార్మోగుతోంది.

ఒక క్షణంవరకు "ఇక ఇప్పుడెవ్వరికీ ముఖం చూపించలేను. కాన 'బేతవా' తల్లి అంకస్థలిలో ఆశ్రయం పొందటమే ఉత్తమమార్గం." అని ఆలోచించింది రామా.

కాని ఈ ఆలోచన ఎంతోసేపు నిల్వలేదు. వెంటనే మళ్ళీ "ఐతే వారిగతి ఏమిటి? నేను కన్పించకపోతే ప్రాణాలతో వుండగలరా? ఐతే ఏంచేయను? ఊరంతా ఏమంటుందోమరి?" అని ఆలోచించింది.

తిరిగి మళ్ళీ ఏదో ఆలోచనవచ్చింది. ఇంతలో రేవు వైపుకు ఎవరో వస్తున్నట్టుగా చప్పుడు అయింది.

ఏరుదాటి పోగలిగిగానా అంటే వారు తప్పక కలుస్తారు. అంతగా దాటలేకపోతే నే చేయగలిగిందేముంది?" అనుకుంది మదిలో.

"ఎవరు? ఆగు," అన్నాడు వెనకనుండి బేతాళీ.

రామా మనస్సులో "జై, గంగామాతకీ జై" అనుకుంటూ నదిలోకిదూకింది. మొసళ్ళంటే భయపడే రామాను ఆ చీకటిరాత్రిలో, ఆ ప్రచండ 'బేతవా' నది భయంకర ప్రవాహం సయితం భయపెట్టలేకపోయింది. అత్యంత సాహసంతో బారలు వేస్తూ మబ్బుల్లోదాగిన చంద్రుని వగిది బేతాలీ దృష్టి నుండి తప్పించుకొని తరంగాలచాటుకు పోయింది రామా.

బేతాలీకేమీ అర్థంకాలేదు. తన అంచనాపట్ల విసుక్కొని వచ్చినదారిన ఇంటికి మరలాడు. "ఏరు అంటే తగని భయంగలపిల్ల. ఇక్కడికెప్పుడూ రాదు. అదేదో జంతువైవుంటుంది" అని మనస్సులో గట్టిగా అభిప్రాయపడ్డాడు బేతాలీ.

ఊళ్ళోకి చేరుకున్నాడు. చూస్తే అక్కడి వెదకులాటలు, గాలింతలు మరీ ఎక్కువగా జరుగుతున్నాయి.

రామా ప్రాణాలొడ్డి నదీప్రవాహంతో సంకులసమరం చేస్తూపోతోంది. ఒక వైపున సుకుమార, దుర్బల దేహం! రెండో వైపున ప్రచండ ప్రవాహం! భీషణప్రయత్నం; గొప్ప దుస్సాహసం; పొంగి పొరలి మీదికొస్తున్న అలలసమూహమంటే భయంలేదు. దృష్టి అంతా ఏదోఒక మహోన్నత విషయం మీద కేంద్రీకరించబడివుంది. అటు 'బేతవా' ప్రచండ కోలాహలం; ఆకాశాన్నంటే తరంగావళి. ఇటు వాటికి సమాధానమివ్వటానికి లేక ఢీకొనటానికి చిన్నకాళ్ళు, చిన్నచేతులూను.

కాని తెల్లవారకముందే రామా అవతలివొడ్డుకు 'దేదర్'కు చాల క్రిందకువెళ్ళి చేరుకుంది. అలసిపోయింది. కొంచెంసేపు వొడ్డుమీద కూర్చుంది. ఉత్సాహహీనతగాని, సందేహం గాని మనస్సులో లేవు.

ఒడ్డుకు చేరకముందే వర్షం ఆగిపోయింది. ఉషారాణి మబ్బుల్ని బ్రద్దలుకొట్టుకొని తనకాంతిని పృథ్వీమండలంపైన వెదజల్ల సాగింది.

రామా లేచి నిలబడింది. ఏదో అంచనాతో 'దేవర్' గ్రామంవరకు వచ్చింది. మరల అక్కడనుంచి ఏదో ఊహించుకుంటూ 'బజటా' దారి వెదకసాగింది. కాని దేవసింహుడు తదితరులద్వారా విన్నదారిని వూహాగానంచేసి కనుగొనుట సాధ్యం కాలేదు. కూర్చుంటూ, లేస్తూ గుండెధైర్యంమాత్రం కోల్పోకుండా పొలాల్లో పనిచేస్తున్న స్త్రీలను 'బజటా'కు దారి ఏదని అడగసాగింది. వాళ్ళు అడిగే ప్రశ్నలకు సరియైన సమాధానాలివ్వకుండా ఏవో కల్లిబొల్లి మాటలు చెప్పి ముందుకు సాగిపోతోంది. ఆ స్త్రీ లంతా దాదాపు ఒకేరకంగా అభిప్రాయపడ్డారు. "అత్తవారింటిదగ్గరనుంచి దొంగతనంగా పారిపోయివస్తోంది. పుట్టింటికి పోతోందికాబోలు. అందుకే ఈ వంకరటింకర సమాధానాలులే."

మూడో జాముకు రామా బజటా చేరుకుంది. కాని శిబూమహతోగారి ఇల్లు తెలియదు. ఐనా ఊళ్ళోవాళ్ళను అడుగుతూ అడుగుతూ పోయి తుదకు అదీ తెలుసుకుంది.

అడిగిన ప్రతిమనిషీ తిరిగి "ఏవూరు ? ఏంపేరు ?" మున్నగుప్రశ్నలు అడిగారు. కాని ఎవ్వరికీ ఏమీ జవాబు చెప్పకుండా తిన్నగా శిబూమహతో వాకిటిముందు కెళ్ళి చేరింది. అక్కడికి వెళ్ళగానే తలనిండా ముసుగుపెట్టి వాకిట నిలబడింది. ఎవరింటికో పోయి ఆగేదానికన్న తన ఇంటికే వెళ్ళటం మంచిదని అనుకుంది.

అక్కడ 'బటూజా'లో దేవసింహునికోరకు విపరీతంగా వెదకటం ప్రారంభమైంది. 'శిబూమాతే' కసలు మతియేలేదు.

'శిబూ' దగ్గరకొచ్చి "ఏవూరమ్మా? ఎవరవమ్మా నీవు?" అని ప్రశ్నించాడు రామాను.

రామా జవాబేమీ ఇవ్వలేదు. తలమీది ముసుగును మరింత కిందకు లాగి నిలబడింది.

"నా కొడుకు సమాచారమేమన్నా తీసుకొచ్చావా లేక నీవూ ఏదైనా ఆపదలోపడి తిరుగుతున్నావా?" అన్నాడు శిబూ కంపితకంఠంతో.

కళ్ళల్లో కన్నీళ్ళు గిర్రున క్రమ్ముకొచ్చాయి. 'అర్ధ రాత్రివేళ ఆ పాడునదిలో స్నానంచేయటాని కెందుకు పోయే వాడోగదా! అయ్యో! నా బిడ్డ ఏమైపోయాడో, ఎక్కడికి పోయాడోగదా! వాడిని చూడకుండా నా ప్రాణా లెలా నిలుస్తాయి?"

మళ్ళీ రామాను ద్దేశించి "ఏమమ్మా సమాధాన మేమీ చెప్ప వెందుకని? ఏదైనా చెప్పరానిఅశుభవార్త కాదుగదా? అయ్యయ్యో, గుండెలు బ్రద్దలైపోతున్నాయి." అన్నాడు.

రామా తలవూపింది, ఏదో సూచిస్తూ, ఏమైనా చెప్పాలని వుందా తల్లీ! అడిగాడు. శిబూ పిచ్చివాడి మాదిరిగా.

రామా ఔనన్నట్టు మళ్ళీ తలవూపింది.

"ఐతే చెప్పుతల్లీ, చెప్పు. నా బిడ్డలేకుండా ఒక్క క్షణం కూడా జీవించలేను. ఆచూకీ ఏమైనా చెప్పితే నీవు ఏం కోరితే అది ఇస్తాను." అన్నాడు శిబూ ఆతురతతో.

ఆ సహజ, సరళ, మంద, స్మితహాసం ముసుగులోనే మరింత వికసితమైంది. సర్వస్వం పొందానన్నట్టుకాని ఆన్విం చని సంకేతం శిబూకూ తెలియలేదు. తదితరులకూ తెలియ లేదు;

రామా నిశ్శబ్దంగా నిల్చొనివుంది. ఈ అమ్మాయికి కొడుకు సమాచారం తెలుసునని శిబూ గ్రహించాడు, సిగ్గు చేతనో లేక ఇంకే కారణంచేతనో నోరువిప్పి చెప్పటంలేదని వూహించాడు. ఆవిడపాదాలవేపుకు చూశాడు. ఎక్కడనుంచో చాలదూరాన్నుంచి నడచివచ్చిందని అనుకున్నాడు. ఎందు కంటే కాళ్ళు శీలమండలవరకు దుమ్ముకొట్టుకొని వున్నాయి. ముళ్ళుగుచ్చుకొని కారిన నెత్తురు ఆ దుమ్ముతో తడిసి ఎండి పోయి వుంది.

"అమ్మాయీ, ఎక్కడనుంచి వస్తున్నావమ్మా 'చిర గ్రామం' నుండా ?

రామా నకారాత్మకంగా తలవూపిందేగాని నోరు మాత్రం విప్పలేదు. శిబూ అప్పుడొక పిల్లవాణ్ణి పిలిపించాడు.

రామా కొంచెం పెడగాపోయి ఆ పిల్లవాడికి దేవ సింహుని సమాచారమూ, తన చిరునామా రెండూ చెప్పింది. తను వచ్చిన కారణం చెప్పకుండా దాచిపెట్టాలనుకుంది. కాని చేతకాలేదు. చేతకాదుకూడా. అవసరమైన విషయాలన్నీ చెప్ప టమే మంచిదని అభిప్రాయపడింది. సంక్షేపంగాచెప్పి వినిపిం చింది. దేవసింహుని తప్పేమీలేదని తండ్రి అభిప్రాయపడే విధంగా చేతనైనంతవరకు చెప్పింది.

శిబూ విని ఆనందంతో గంతులు వేయసాగాడు. బాల్యం మళ్ళీ తిరిగివచ్చినట్టుగా కోడల్ని వెంటనే లోపలికి పంపించి ఇరుగు పొరుగు అమ్మలక్కలను పిలిచి "ఏమే అక్కయ్యా, ఏమమ్మో వదినగారూ, రండి, రండి, వచ్చి ఒకసారి చూచి పొండి ఎటువంటి బంగారంలాంటి కోడలు వచ్చిందో చూడండి దేవసింహుడు తీసుకొచ్చాడు" అని కేకలు పెట్టి చెప్పసాగాడు.

విన్న వాళ్ళందరూ ఆశ్చర్య చకితులయ్యారు. పైగా భయమూ కల్గింది. ఇళ్ళల్లోంచి బైటకొచ్చి చూడసాగారు. శిబూమహతోకు పిచ్చెక్కిందని అభిప్రాయపడ్డారు. కాని రామాతో మాట్లాడిన ఆ మొరటి పిల్లవాడు నిజమని చెప్పిన మీదట అందరూ కోడల్ని చూచుటకు లోనికి పోయారు.

కొంచెం స్థిమితం చిక్కిన తర్వాత శిబూ వూళ్ళో ఒక తన వృద్ధమిత్రుని వద్దకు వెళ్ళాడు. దేవసింహుని వెదకుటకు వెళ్ళమంటే ఒంట్లో ఓపిక లేదని ఇల్లు కదలకుండా కూర్చున్న మిత్రుడితడు.

"కోడలు వచ్చింది. దేవసింహుడు తీసుకొచ్చాడు. వాడూవచ్చినట్లేలే" ఇవ్వాళ అత్తగారింటిదగ్గర వుండిపోయాడు. రేపువస్తాడు, చూడండి, ఆ వెధవ అమ్మాయిని ఒంటరిగానే పంపించాడు. ఏరు ఈదుకొని వచ్చింది. బక్కచిక్కిన అమ్మాయి కాని గొప్పసాహసంగల పిల్లలే. నేడు మీఎదుటనే వంద గేదెలు దానం చేసివేస్తా;" అని పసిపిల్లలమాదిరిగా వెక్కెక్కి ఏడ్వసాగాడు.

ఇంతలో వూళ్ళో చాలా మందికి తెలిసింది. ఒక్కొక్కరేవచ్చి శిబూ దగ్గర చేరసాగారు. శిబూ ఏమేమో తలా

తోకలేని మాటలు మాట్లాడుతూ పోతున్నాడు. వాటిలో నుంచి అసలు విషయమేమిటో వచ్చినవారు గ్రహించారు.

"అందరూ ఇప్పుడే 'బరాల్' ప్రయాణంకండి. బాదల్ చౌధరిని అవమానించినదానికి క్షమాపణ కోరుకోవాలి. నా స్వంతకూతురు పెండ్లికి వంద గేదెలు యిస్తానని చెప్పినా మూడుముళ్ళూ పడిపోయినతర్వాత నేను మాత్రం నీతిగా వుంటానా! సరే, అబ్బాయితో మాత్రం ఏమీ చెప్పకండి." అన్నాడు శిబూ.

"అబ్బాయి తప్పేముంది? ఇదంతా ఆపిచ్చిబాదల్ చౌధరి చేసిందేగా. పెళ్ళినాడు ఎటువంటి ఎటువంటి బూతు కూతలుకూశాడో మనంచూడలేదా!" అన్నాడొకడు.

"గతజలసేతుబంధనమెందుకులెండి. బూతులు కూయటంలో మనమూ ఏమి తీసిపోలేదుగా. పైపెచ్చు ఒక అడుగు ముందేవున్నాం. కోడలు ఏంకోడలు! రత్నంలాంటిదనుకోండి" అన్నాడు శిబూ.

పెండ్లికొడుకు తరఫువారు ఎన్నివేల బూతులుకూసినా పిల్లకాయ తరఫువాళ్ళు చచ్చినట్లు విని మెదలకుండా ఊరుకోవలసిందేగాని ఇతనిమాదిరిగా ఎవ్వడూ వ్యవహరించడు. అలాంటప్పుడు ఏమీజరగకుండానే మళ్ళీఅతనింటికి వెళ్ళటమా?" అన్నాడొక గ్రామస్థుడు.

"ఇప్పుడిక అవన్నీ మరచిపోండి. బాదల్ తరఫున చేతులు జోడించి మీ అందరినీ క్షమించమని అడుగుతున్నా. అబ్బాయి లేకపోతే నిమిషమొకయుగంగా వున్నది. బాదల్ చౌధరి ఈసారి మళ్ళీఏమైనా అంటే మీ అందరూకలిసి మా

ఇద్దరి మెడకాయలు కత్తిరించి అవతల పారవేయండి." అన్నాడు శిబూ వినయంగా.

ఊళ్ళోవాళ్ళంతా ఈ ప్రాధేయతచూచి నవ్వుకున్నారు.

"వస్తాంలే, కాస్త దేవసింహునికూడ అడిగిరావాలి. ఇదంతా ఏరూలుప్రకారం చేశాడో ఏమిటో తెలుసుకోవాలి." అన్నాడొకడు.

"వద్దువద్దు, ఏమీ అడగవద్దు. వాడేంచేశాడో అది మినహా చేయగల్గిందిమాత్రం మరొకటిఏముంది?" అన్నాడు శిబూ గంభీరంగా.

# 22

ఆరోజునసే సాయంత్రం అనేకమంది బంధుబాంధవులతో కలసి 'దేదర్' మీాదుగా 'బరేల్' వచ్చాడు 'శిబూ' మహాతో. వారు వస్తున్నవార్త తెలిసి తనకొడుకులతో రేవు దగ్గరకు ఎదురొచ్చాడు బాదల్‌చౌధరి. 'బేతాలీ' ఒక్కడు మాత్రమే రాలేదు.

'బజటూ' వాసు అన్నిటికన్నముందు 'రామూ' కుశలంగా తమ గ్రామంచేరిందన్న సంగతి చెప్పారు. వియ్యంకు లిద్దరూ గాఢంగా ఆలింగనం చేసుకొన్నారు. తర్వాత ఒకరినొకరు కౌగిలించుకొని ఏడ్చుకున్నారు.

అత్తవారింట్లో ఒకగదిలో స్పృహలేనివానిలా పడివున్నాడు దేవసింహుడు. అటు రామూను వెదకుటకూ వెళ్ళలేక పోయాడు, ఇటు ఆవిడ క్షేమసమాచారాలూ తెలుసుకోలేక

పోయాడు. ఒకవేళ రామా అన్వేషణార్థమై అత్తవారింటి నుంచి తప్పించుకుపోయివుంటే అప్పుడేమైనా చేయగలిగివుండే వాడో లేదో, లేక స్వయంగా ప్రాణాలతో వుండివుండేవాడో కాదో, చెప్పటం కష్టమే. 'బేతాలీ' తన ప్రియసోదరి విష యంలో శోకసంతప్తుడై, ఏమీతోచక దేవసింహుని దగ్గర కాపలాకాస్తున్నట్టుగా కూర్చొనివున్నాడు. దేహానికి తగిలిన దెబ్బ దేవసింహుని పెద్దగా బాధించలేదు. కాని గాయపడిన స్థితిలో కదలకుండా పడివుండటంవల్ల మాత్రం వివేకబుద్ధులు కుంఠితమైపోయాయి. మధ్యమధ్యలో మగతకళ్ళతో ఇటూ అటూ కొద్దిగా చూస్తున్నాడు.— ఒకప్పుడు ఏదో అక్కడ వున్నట్టు, కాని ఇప్పుడు లేనట్టు.

బేతాలీ గాయాలకు చికిత్సచేస్తున్నాడు 'శిబూ' మహ తోగారు, 'బజటా' వాళ్ళు మరికొందరు రేవుదగ్గరకొచ్చారని తెలిసింది. కాని రవ్వంతకూడా ఆశ్చర్యపడలేదు.

వాళ్ళంతా రేవుదగ్గరనుంచి ఇంటికిరాకముందే అతనికి రామా 'బజటా'చేరుకున్నదన్న సమాచారమందింది. ఈవార్త వూరంతా విద్యుత్ లా వ్యాపించింది.

ఈవార్త దేవసింహునకుకూడ నెమ్మదిగా చేర్చబడింది. ఇలాంటి హర్షాధిక్యత సమయంలో హర్షస్వరూప మెలావుం టుందో చెప్పటం అనవసరం, ఆ ఆనందోత్సాహాలను బిగప ట్టుకోలేకపోయాడు దేవసింహుడు, శిబూమాతేగారుకూడా కొడుకువద్దకు వచ్చారు. తండ్రిఎదుటమాత్రం ఆ అపార ఆనం దాన్ని కొద్దిగా వ్యక్తం చేయగలిగాడు.

కొద్దిగొప్పగా మిగిలివున్న ఆకాస్తసంకోచాన్నికూడ పోగొట్టుటకు తండ్రి ప్రయత్నించాడు. కొడుకునుద్దేశించి" నీ స్థితిలో నేను వుంటేనేనూ నీవు చేసినదేచేసేవాణ్ణి. దురాగ్రహం, మూర్ఖత్వంతో మేము మీ ఇద్దరినీ ఎంతో బాధపెట్టాం. కాని కోడలి పుణ్యప్రతాపంవల్ల మనమందరం ఉద్ధరించబడ్డాం." అన్నాడు.

"నీ అపరాధంగురించి చెప్పదలుచుకోలేదు. దానికి తగినప్రాయశ్చిత్త మేమిటో ఈ సమయంలో తట్టనుకూడ తట్టదు." అన్నాడు బేతాలీ.

"తప్పంతానాదే, దీనికంతకూ మూలం నా లోభితనమే. మాటయిచ్చి తప్పిపోయాను. దీనివల్లనే ఇన్నికష్టాలు వచ్చాయి. ఆనాడు లగ్నసమయంలోనే తోలిపెట్టవలసిన ఆ వందగేదెల్ని రేపే 'బజటా' తోలిపెడ్తా" అన్నాడు బాదల్.

"ఇలాంటివానల వరదల సమయంలోనా?" అన్నాడు బేతాలీ.

"గేదెలు మనుష్యులకంటె ఎక్కువబాగుగానే ఈదగలవు." అన్నాడు బాదల్ గట్టిగా.

"ఇక్కడిసొత్తూ, అక్కడిసొత్తూ అంతా ఈ కొడుకులు కూతుళ్ళదే. ఎప్పుడుఅవసరమైతే అప్పుడే అడుగుతాను. ఇప్పుడప్పుడే తొందరేమివచ్చిందిలెండి." అన్నాడు శిబూమహాతో అవరుద్ధకంఠంతో.

'బజట్టా' నుంచి వచ్చినవారిలో స్వకులస్థు డొకడు "కోడలువచ్చిన సంతోషంలో నిన్న మామమహాతోగారు వంద గేదెలు దానంచేసివేశారు." అని చెప్పాడు.

"నా తప్పును మన్నించమని అడుగుటకు వచ్చాను. వివాహసమయంలో ఎంతో అసహ్యంగా దుర్భాషలాడాను." అన్నాడు శిబూ.

దీనిమీాదట వియ్యంకుళ్ళు ఇద్దరూ గాఢంగా ఆలింగనం చేసుకున్నారు.

రెండోనాడు లేక మూడోనాడో వందగేదెలు 'శిబూ' ఇంటికి తోలిపెట్టాడు బాదల్.

## 23

చాలారోజుల అనంతరం 'బరాల్'లో రామూ కొక రోజున సుభద్ర కన్పించింది. బంగారపు కడియం బహూకరిస్తూ "తీసుకోకతప్పదు. తీసుకోనని మొండికేస్తే వీపు బద్దలుకొడ్తా" అంది రామూ.

ఆ పిమ్మట కొంతసేపు ఏవో ముచ్చట్లు చెప్పుకున్న తర్వాత "ఈ మగవాళ్ళ నేమనాలి? 'నన్ను నీపాదాలకు సమర్పిస్తున్నా'అని ఆయన ఒకనా డన్నారు. ఇలాంటి సిగ్గులేనిమాట ఎప్పుడైనా ఎవరి నోటినుండి అయినా రాతగినదేనా?" అంది రామూ.

సమాప్తం.

